# NP 007 బబుల్ గమ్

**ఉచితం**
మీ 007 ప్యాక్‌లో తెల్లటి బబుల్ గమ్ గనక ఉంటే, అమ్మకందార్ల లేక దుకాణదారుడి దగ్గర నుండి మరో 007 బబుల్ గమ్ను ఉచితంగా పొందండి.

ఆట స్థలాల్లో గాని, బయటగాని, మన భావి ఆట గాళ్ళందరికీ ఉత్సాహాన్ని కలిగించేది కేవలం NP 007 బబుల్ గమ్ మాత్రమే.
వాళ్ళకి 007 అంటే చెప్పలేనంత ఇష్టం.
ఎందుకంటే, అది 'బబుల్ శక్తి'తో నిండివుందిగా మరి!
NP—బబుల్ గమ్ ఉత్పాదకుల్లో అగ్రగణ్యులు.
ఐ.ఎస్.ఐ. చిహ్నం ఒక్క
ఎన్‌పి బబుల్ గమ్‌లకు మాత్రమే వుంది.



*NP 'బబుల్ శక్తి'ని మరో సారి బబుల్ గమ్*

పొందండి.








ది నేషనల్ ప్రొడక్ట్స్, బెంగుళూరు

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["అఖండదైవజ్ఞుడు"] కు ఆధారం జి. ప్రభాకరరెడ్డి రచన.

మూఢ విశ్వాసాలూ, గుడ్డి నమ్మకాలూ చాలా వరకు హాని కలిగించేది ఎలాగంటే, అవి మనుష్య యత్నాన్ని భగ్నపరుస్తాయి. ముఖ్యంగా జ్యోతిషంలో గాఢ నమ్మకం ఉన్నవాడు ప్రయత్నం విషయంలో శ్రద్ధ చూపడు. అందుచేత ఒక మనిషి చేత దుష్ట ప్రయత్నాన్ని మాన్పించటానికి కూడా గుడ్డి నమ్మకాన్ని ఉపయోగించవచ్చు. ఈ కథలో వసంత రాజు మూఢ విశ్వాసం కొద్దీ యుద్ధాలు మానేస్తాడు; శమంతరాజు తన శక్తికిమించిన పని సాధిస్తాడు!

సంపుటి 62 ఏప్రిల్ '78 సంచిక 4

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA




సుఖదుఃఖే భయక్రోధౌ,
లాభాలాభౌ, భవాభవౌ,
యచ్చ కించిత్ తథాభూతం
నను దైవస్య కర్మతత్. 1

[కారణం కనిపించని సుఖదుఃఖాలూ, భయక్రోధాలూ, లాభనష్టాలూ, జననమరణాలూ లాటివన్నీ దైవికంగా జరిగేవే.]

ఋషయో ప్యుగ్రతపసో
దైవే నాభిప్రపీడితాః
ఉత్సృజ్య నియమాం స్తీవ్రాన్
భ్రశ్యన్తే కామమన్యుభిః. 2

[అతి ఉగ్రమైన తపస్సు చేసే ఋషులు కూడా దైవప్రాబల్యం చేత తపోనియమాలన్నీ గాలికి వదిలేసి కామాదులకు వశులై భ్రష్టులవుతున్నారు.]

అసంకల్పిత మే వేహ
య దశస్మాత్ ప్రవర్తతే,
నివ ర్త్యారంభ మారబ్ధం
నను దైవస్య కర్మతత్. 3

[ప్రయత్న పూర్వకంగా ఆరంభించిన పని ఆపేసి, చప్పున, ఎన్నడూ అనుకోని పని ప్రారంభించడం దైవికం.]

దైవకార్యం




## 58

రాజుకూ, నలుగురు మంత్రులకూ స్థిర జీవి మీద గురి కుదిరింది. అందుచేత అవి రక్తాక్షి వద్దనటం పాటించకుండా, స్థిరజీవిని తమ గుహకు తీసుకుపోయాయి.

దారిలో స్థిరజీవి, "రక్తాక్షి ఒక్కడే నా రహస్యం గ్రహించినవాడు. మిగిలిన వాళ్ళకు రోజులు బాగాలేక, అవి రక్తాక్షి సలహాను తోసిపుచ్చాయి," అనుకున్నది.

వాళ్లు కొండగుహ చేరుకున్న తరవాత అరిమర్దనం, "స్థిరజీవి మన మేలు కోరినవాడు. అతనికి కోటలో కోరిన ప్రదేశం ఇయ్యండి," అన్నది.

ఈ మాట విని స్థిరజీవి సంతోషించి నప్పటికీ, తనలో ఇలా అనుకున్నది:

"నేనేమో వీళ్ళ వినాశనానికి పథకం వేస్తున్నవాణ్ణి. కోట మధ్య ఉంటే నన్ను అందరూ గమనిస్తారు. ముఖ్యంగా రక్తాక్షి, అతడి అనుచరులూ నన్ను వెయ్యి కళ్ళతో కనిపెట్టుతూ ఉంటారు. అంత కన్న కోట ద్వారంవద్ద ఉన్నట్టయితే, తొందర పనుల మీద కోటలోపలికీ, బయటికీ వెళ్ళేవారు నన్ను శ్రద్ధగా గమనించరు. నా పథకం పారుతుంది."

ఇలా అనుకుని అది అరిమర్దనంతో, "మహారాజా, మీది దొడ్డబుద్ధి. నాకు మీ కోటద్వారం లోపల చోటు యివ్వండి. నేను రోజూ వచ్చి తమ దర్శనం చేసుకుని, నా విధి నిర్వర్తిస్తాను," అన్నది.

అరిమర్దనం స్థిరజీవి నమ్రత చూసి ఎంతో సంతోషించి, దాని కోరికకు సమ్మతించింది. స్థిరజీవి తిరిగి పుంజుకోగలందులకు దానికి ప్రత్యేకమైన ఆహారం ఏర్పాటయింది. అది త్వరలోనే నెమలి బలానికి సమమైన బలం సంపాదించింది.

తన సలహా నిరాకరించబడటమూ, స్థిరజీవిని అందలం ఎక్కించటమూ చూసి రక్తాక్షి రాజుతో, ''ప్రభూ, బంగారు రెట్ట వేసే పక్షిని విడిపించిన రాజూ, అతడి మంత్రులూలాగే మీరు చాలా అవివేకంగా ప్రవర్తించుతున్నారు.'' అన్నది.

''ఏమిటా కథ?'' అన్నాడు రాజు. రక్తాక్షి ఆ కథ ఇలా చెప్పింది:

ఒకప్పుడు ఒక కొండ చరియలో ఒక పక్షి నివసించేది. అది బంగారు రెట్టలు వేసేది. ఒక వేటగాడు ఈ వింత చూసి చాలా ఆశ్చర్యపోయాడు. వాడు దాన్ని ఉచ్చువేసి పట్టుకుని, అది తన వద్దనే ఉన్నట్టయితే రాజుకు తెలిసి తనకు శిక్ష పడుతుందని భయపడి, దాన్ని రాజు వద్దకు తీసుకుపోయి, ''మహారాజా, దీని రెట్ట మేలిమి బంగారం. నేను దీన్ని తమకు కానుకగా తెచ్చాను,'' అన్నాడు.

రాజు మంత్రులతో, ''ఏమాశ్చర్యం! ఇదేమిటో చూతామా?'' అన్నాడు.

''మహారాజా, పక్షి ఏమిటి, బంగారు రెట్ట వెయ్యటమేమిటి? ఎక్కడైనా కద్దా? ఇంత పచ్చి అబద్ధం చెప్పే ఈ పామరుడి మాటలు తమరు ఎలా నమ్మారు?'' అన్నారు మంత్రులు. రాజు తన మంత్రుల మాటలు విని ఆ పక్షిని విడిచిపెట్టాడు.

అరిమర్దనమూ, అతడి మంత్రులూ ఈ కథ విని కూడా తమ అభిప్రాయం మార్చుకోక, స్థిరజీవి పట్ల మరింత ఆదరం చూపుతూ వచ్చాయి.



అప్పుడు రక్తాక్షి తన అనుచరులతో రహస్యంగా, "ఈ రాజ్యం నాశనం కాబోతున్నది. అవసానకాలం దగ్గిర పడింది. రాజునూ, మంత్రులనూ కాపాడటం సాధ్యం కాదు. వాళ్ళకు హితవు మాటలు రుచించలేదు. వ్యవధి ఉండగానే ఈ కోటను విడిచిపోదాం. శత్రువు నిజమైన మిత్రుడు కావటం ఎక్కడైనా ఉంటుందా? వెనకటికి ఒక గుహ మాట్లాడిందట!" అన్నది.

"ఏమిటా కథ?" అని అనుచరులు అడిగిన మీదట రక్తాక్షి ఇలా చెప్పింది:

ఒక మహారణ్యంలో ఖరనఖరం అనే సింహం ఉండేది. ఒకనాడు అది రోజల్లా తిరిగినా, తినటానికి ఏ జంతువూ దొరకలేదు.

సూర్యుడు అస్తమించుతూండగా దానికి ఒక పెద్ద కొండగుహ కనిపించింది.

"రాత్రికి తప్పక ఏదో ఒక మృగం ఇందులోకి వస్తుంది. అప్పుడు దాన్ని చంపి తింటాను," అనుకుని సింహం ఆ గుహలోకి వెళ్ళి పడుకున్నది.

ఆ గుహలో ఒక నక్క ఉంటున్నది. కొంతసేపటికి ఆ నక్క వచ్చి, "ఓ గుహా! ఓ గుహా!" అని పిలిచింది.

కొంచెంసేపు ఆగి నక్క మళ్ళీ పిలిచింది. జవాబులేదు.

నక్క గుహను మూడోసారి పిలిచి, "నేను రాత్రి రాగానే నా పిలుపుకు సమాధానం ఇచ్చేటట్టు ఒప్పందం చేసుకున్నావు, మరిచావా? నువు ఆ మాట నిలబెట్టుకోకపోతే, అదే షరతు మీద ఇంకో గుహ చూసుకుంటాను," అన్నది.

ఈ మాట విన్న సింహం తనలో, "ఈ గుహ పిలిస్తే పలుకుతుంది లాగున్నది. నేను పలక్కపోతే నక్క వెళ్ళిపోతుంది. నేను తిండికి మాడాలి!" అనుకుని, "ఓయ్!" అని జవాబిచ్చింది. దాని భయంకర గర్జన గుహలో మరింత భయంకరంగా మార్మోగింది.

నక్క నవ్వుకొని, "అదా సంగతి? గుహ మాట్లాడగా ఎన్నడూ వినలేదు!" అంటూ అతివేగంగా పారిపోయింది.



# 196. యిన్ రాజుల సమాధి

చీనాలోని హెూనాన్ రాష్ట్రానికి చెందిన అన్యాంగ్ సమీపంలో క్రీస్తు పూర్వం 12 శతాబ్ది ఆరంభంనాటి యిన్ రాజులసమాధి బయట పడింది. అది చెక్కు చెదరకుండా ఉన్నది. సమాధిలో దొరికిన కంచు వస్తువుల మీద చెక్కిన పేర్లు చూడగా, అది యిన్ రాజవంశానికి చెందిన వు టింగ్ రాజు భార్యదిగా కనిపిస్తుంది. (యిన్ రాజవంశం క్రీ. పూ. 16 నుంచి 11 శతాబ్ది దాకా పాలించింది.)

ఇందులో దాదాపు 200 కంచు పాత్రలు దొరికాయి. వాటిలో 70 శాతం పాన పాత్రలు. వీటిలో పెద్దవి జతలు జతలుగా ఉన్నాయి. వాటి మీద జంతువుల తలలు చెక్కి ఉన్నాయి.

సమాధిలో 400 జేడ్ వస్తువులూ, శిలావస్తువులూ ఉన్నాయి. అందులో పది మనుషుల ప్రతిమలు. వాటినిబట్టి అనాటి దుస్తులూ, వస్త్రధారణా తెలుస్తాయి. చిత్రంగా వాటిలో ఒక అర్ధనారీశ్వర ప్రతిమ కూడా ఉన్నది. ఇతర శిల్పాలలో పులులూ, ఎలుగుబంట్లూ, ఏనుగులూ, ఎద్దులూ, గొర్రెలూ, గుర్రాలూ, కోతులూ, చెవుల పిల్లులూ, గదలూ, చిలుకలూ మొదలైన ప్రాణుల బొమ్మలు ఉన్నాయి.






# మాయాసరోవరం

## 28

[మాయాసరోవరేశ్వరుడు దొంగచాటు దెబ్బకొట్టి, జయశీలుడి మెడకు ఉచ్చు తాడు బిగించాడు. దానిని తెగనరుకుదామనుకున్న అతడితో, మాయాసరోవరేశ్వరుడు మంచిగా మాట్లాడి, కాంచనమాలతో పాటు, అతణ్ణి సరోవరం కేసి తీసుకుపోసాగాడు. ఆ సంగతి నరభక్షకుల ద్వారా, సిద్ధసాధకుడికి తెలిసింది. తరవాత—]

నరభక్షకులు అంతా చెప్పి, ఏంత ఏనుగు మీదివాడు, పట్టుకుపోతున్న మనిషి రూపురేఖలు వర్ణించగానే సిద్ధసాధకుడికి, అతడు తన మిత్రుడైన జయశీలుడని తెలిసిపోయింది. కాని, అతని వెంట వున్న యువతి ఎవరు?

నరభక్షకులు చెప్పింది విని ఆశ్చర్యపోతున్న రాజు కనకాక్షుడితో, సిద్ధసాధకుడు, "మహారాజా, యిక నాకు సెలవిప్పించండి. నా స్నేహితుడైన జయశీలుణ్ణి, ఆ మాయాసరోవరం దుష్టులు బంధించి తీసుకుపోయారు. అంత మహా శూరుడు వాళ్ళకు ఎలా దొరికిపోయాడో నాకు అర్థం కావటంలేదు. అతణ్ణి రక్షించటం నా బాధ్యత," అంటూ నరవానరం భుజాలమీద ఎక్కబోయాడు.

రాజు కనకాక్షుడు అతణ్ణి వారించి, "సాధకా, ఆ జయశీలుణ్ణి రక్షించవలసిన



బాధ్యత నాకూ వుంది. కొందరు భటుల్నీ, అశ్వికుల్నీ వెంటబెట్టుకుని నేనూ, నీతో పాటు వస్తాను. మనం కాలయాపన చెయ్యకుండా, ఆ మాయాసరోవరం ఎక్కడ వున్నదో తెలుసుకోవటం అవసరం. నీ జలవృక భటుణ్ణి అడిగి తెలుసుకోరాదా?'' అన్నాడు.

సిద్ధసాధకుడు తల వూపి, శూలాన్ని జలవృక రాక్షసుడి గుండెల కేసి గురిచేసి, ''ఒరే, జలవృకభటా! నువు, నాకు విశ్వాస పాత్రుడివైన భటుడివా లేక, నీ పాతయజమాని ఆ మాయాసరోవర రాక్షసుడి పక్షాన, నా మీద వేగుకు వచ్చావా? నిజం చెప్పు,'' అన్నాడు.

ఆ ప్రశ్నకు జలవృకుడు ఏ మాత్రం బెదరక, రాతిగదను సిద్ధసాధకుడి పాదాల ముందు పెట్టి, ''దొరా, నిజమైన జలవృకుడు ఆడినమాట తప్పడు. అలా తప్పినవాణ్ణి, నీటినక్క కింద వేటాడతాం. నేను తమకోసం ప్రాణాలైనా యివ్వటానికి సంకోచించని స్వామిభక్తి గల సేవకుణ్ణి,'' అన్నాడు.

''ఆ మాట నిజమైతే, యిప్పుడు చెప్పు, ఆ మాయాసరోవరం ఎక్కడ వున్నది?'' అన్నాడు సిద్ధసాధకుడు.

''దొరా, లోగడ ఒకసారి తమకు మనవిచేశాను. ఆ సరోవరం ఎక్కడ వున్నదో చెపితే, నా తల పగిలి చస్తాను. అది మా జాతివాళ్ళకు, సరోవర రాజుతో పాటు, మా రాజు కూడా యిచ్చిన శాపం,'' అన్నాడు జలవృకుడు.

ఆ మాటలకు సాధకుడు పెద్దగా నవ్వి, ''ఆ సరోవరం పక్షి వెధవకు శాపాలిచ్చే శక్తివుంటే, వాడు హంసలరథం ఆకాశంలో తల కిందులైనప్పుడు, అక్కడి నుంచి పల్లటీలుకొడుతూ సూటిగావచ్చి, నరభక్షకుల కాగేనీళ్ళ బానలో పడడు, తెలిసిందా?'' అన్నాడు.

జలవృకుడు నిలువెల్లా వణికిపోతూ, ''దొరా, మీరు నా మాట నమ్మటంలేదు గనక, నాకు చావు ఎలానూ తప్పదు.



అయినా, నోటితో చెప్పకుండా, సంజ్ఞలతో తెలియపరిస్తే, ఒక వేళ బతికివుంటా నేమో!'' అంటూ పోయి, చెట్టునుంచి, ఒక ఎండుపుల్లను విరిచి తెచ్చాడు.

''వృకభటా, నీ ప్రాణానికొచ్చిన భయం ఏమీ లేదు. నేను మహాకాలుడి భక్తుణ్ణి. ఒకవేళ నువ్వు చావటమే జరిగితే, నిన్ను క్షణాలమీద కైలాసానికి పంపి, అక్కడ సుఖపడేలా చేస్తాను,'' అన్నాడు సాధకుడు.

జలవృకుడు తాను తెచ్చిన ఎండు పుల్లతో నేలమీద గీట్లు గీస్తూ, మధ్య మధ్య, ''అయ్యో, తల బద్దలవుతున్నది, గుండెలు చిక్కపట్టుతున్నవి,'' అంటూ అరవసాగాడు.

కనకాక్షరాజు, జలవృకుణ్ణి సమీపించి సాధకుడితో, ''సిద్ధసాధకా, నా పిల్లల్ని తగినంత మంది అంగరక్షకులతోడు లేకుండా, అరణ్యంలోకి పోనివ్వటం, ఎంత మంది చిక్కులకు కారణమైంది! పాపం, యీ నీటితోడేలు వెధవ నిజంగానే తల పగిలి చస్తాడేమో,'' అన్నాడు.

''మహారాజా, వీడు ఒట్టిమూఢుడు! మహాకాలుడి దర్శనం అయి, ఆయన దీవించందే, ఏ నరమానవుడికీ యితర్లను శపించగల శక్తిరాదు,'' అంటూ సిద్ధ సాధకుడు, జలవృకుడు మట్టిలో గీస్తున్న గీట్ల కేసి పరీక్షగా చూస్తూ, ''ఒరే, భటా! ఈ నిలువు గీతలేమిటి? ఈ వంకరటింకర గీట్లేమిటి?'' అని అడిగాడు.

జలవృక రాక్షసుడు తల ఎత్తకుండానే నిలువెల్లా వడవడ వణికిపోతూ, ''దొరా, ఇవి, యీ దాపులనున్న కొండలు, యివన్నీ అరణ్య వృక్షాలు. వాటిలో ఎత్తయిన యీ వృక్షం ఒక రాతి గుట్ట మీద వున్నది. ఆ చెట్టు ఎక్కి, చిటారు కొమ్మకు పోయి ఒకసారి తూర్పుకూ, మరొకసారి పడమరకూ చూసి, తరవాత ఉత్తరంగా చూస్తే, మాయాసరోవరం కంటబడుతుంది!'' అని, రెండు చేతులతో గట్టిగా తలపట్టుకుని, ''దొరా, రహస్యం



చెప్పేశాను. తల పేలిపోతున్నది. హా, చస్తిని!'' అంటూ దభీమని కింద పడిపోయాడు.

సిద్ధసాధకుడు చప్పున వంగి, వృకుడి ముక్కు దగ్గిర చేయిపెట్టి చూ… వాడింకా గాలి పీల్చి వదులుతూండటం, గమనించి, ''మహారాజా, మూఢ నమ్మకాలు ముప్పు తేగలవనేందుకు, యీ జలవృకుడే మనకు సాక్ష్యం. వాడు శాపభయంతో, గుండెలవిసి కిందపడ్డాడే తప్ప, చావలేదు,'' అని, దాపులనున్న నరభక్షకులతో, ''ఒరే, తక్షణం పోయి నాలుగైదు కుండల నిండుగా నీళ్ళు తెండి,'' అన్నాడు.

నరభక్షకులు ఆశగా జలవృక రాక్షసుడి కేసి చూస్తూ కదలా మెదలక వుండిపోయారు. వాళ్ళ వాలకం గమనించిన సిద్ధసాధకుడు శూలం పైకెత్తి, ''దుర్మార్గులారా! నా ఆజ్ఞ విన్నారా? కదలరేం?'' అని కళ్ళెర్ర చేశాడు.

నరభక్షకుల నాయకుడు సంజ్ఞ చేయగానే, వాళ్ళ ముసలిగణాచారి ముందుకు వచ్చి, రాజు కనకాక్షుడికి సాష్టాంగపడి లేచి, ''మారుమూల అరణ్యాల్లో బతికే మాకు, మంచీ, మర్యాదలూ ఎలా పాటించాలో తెలీదు. మహారాజనేది మీ పేరు కాదనీ, అధికార బిరుదనీ అనుకుంటున్నాను. తమరు, యీ దయ్యాలపోతును అవతలికి నెట్టించి, యీ నీటి రాక్షసుణ్ణి మాకు యిప్పించండి; మీ పేరు చెప్పుకు మరీ తింటాం,'' అన్నాడు.

ముసలిగణాచారి మాట ముగించే …లే సిద్ధసాధకుడు వాడి జుట్టు పట్టు… ''ఒరే, నరభక్షక క్రూరమృగమా! నువ్వే, నా శూలానికి గుచ్చి మహాకాలుడికి బలి చెయ్యబోతున్నాను,'' అంటూ శూలం పైకెత్తాడు.

సిద్ధసాధకుడు, గణాచారిని శూలంతో పొడవబోయే సమయానికి, దూరం నుంచి జలాశ్వం మీద వేగంగా వస్తున్న సర్ప నఖుడు అది చూసి, పెద్దగా గొంతెత్తి,



''సిద్ధసాధకా, తొందరపడకు! మనం మాయాసరోవరంలోని జలవృక రాక్షసులతో పోరాడవలసిన పరిస్థితి వచ్చింది. అందుకు మన పక్షాన, యీ నరభక్షకులు కూడా కలిసి వస్తారేమో ప్రయత్నించి చూడాలి,'' అంటూ కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే సిద్ధసాధకుడు శూలాన్ని దించి తలతిప్పి చూశాడు. అది అదనుగా తీసుకుని నరభక్షకుల గణాచారి దూరంగా పారిపోయి, వాళ్ళ జాతివాళ్ళ గుంపులో కలిసిపోయాడు.

సర్పనఖుడు సిద్ధసాధకుడి దగ్గిరకు వచ్చి గుర్రం దిగి, నేలమీద చచ్చినట్టు పడివున్న జలవృకభటుణ్ణి చూసి, ''సాధకా, యితణ్ణి పరలోకానికి పంపావా ఏం! వీడు నీకు నమ్మిన బంటుగదా?'' అన్నాడు.

''వీడు నమ్మిన బంటే. కాని, మీలాగే వీడికీ, వాళ్ళ రాజేకాక, సరోవరేశ్వరుడి శక్తిలో కూడా నమ్మకం వున్నట్టున్నది. ఏదో శాపం అంటూ, మాయాసరోవరానికి వెళ్ళే దారి గుర్తులు నేలమీద గీస్తూ కింద పడిపోయాడు,'' అన్నాడు సిద్ధసాధకుడు.

అంతలో కొందరు కనకాక్షరాజుగారి భటులు పాత్రల్లో నీళ్లు తెచ్చి, జలవృక రాక్షసుడి మీద పోశారు. ఆ చల్లని నీరు పైన పడగానే వాడు నేలమీద అటూ యిటూ పొర్లుతూ, కళ్ళు తెరవకుండానే, ''నేనెక్కడున్నాను? నరకంలోనా, సరోవరంలోనా?'' అంటూ అరవసాగాడు.

సిద్ధసాధకుడు వాడి వెన్నుమీద కాలితో గట్టిగా ఒకసారి తన్ని, ''జలవృకభటా! నీకు శాపవిముక్తి కలిగింది; బతికించాను, లే!'' అన్నాడు.

ఆ మాటలతో జలవృకుడు లేచి కూర్చున్నాడు. సర్పనఖుడు తృప్తిగా తలాడించి, దాపులనున్న రాజభటుల్నీ, రాజు కనకాక్షుణ్ణీ చూసి, ''వైద్యదేవుడు హంసల రథంలో ఎగురుతున్నప్పుడు చెప్పగా తెలిసింది, వీరేగదా హిరణ్యపుర రాజులైన కనకాక్షులుంగారు?'' అన్నాడు.



రాజు కనకాక్షుడు ఆ క్షణంవరకూ సర్పనఖుడి వింత వేషాన్నీ, వాడెక్కి వచ్చిన జలాశ్వాన్నీ చూస్తూ ఆశ్చర్య పోతున్నాడు. ఇప్పుడాయన అతడన్న మాట అర్థంకాక, "ఎవరా, వైద్యదేవుడు? నా రాజ్య పౌరుడేనా ?" అని అడిగాడు.

"మహారాజా, ఆ సంగతి నాకు తెలియదు. ఆయన, నా వెనకగా బయలు దేరి యిక్కడికే వస్తున్నారు." అన్నాడు సర్పనఖుడు.

"సాధకా, నువ్వెరుగుదువా, యీ వైద్య దేవుణ్ణి ?" అన్నాడు కనకాక్షుడు. సిద్ధ సాధకుడు కొంచెంసేపు చెప్పటమా, మానటమా అని తటపటాయించి, చివరకు, "మహారాజా, ఆ వైద్యదేవుణ్ణి గురించి, మాయాసరోవరంలో పరమ శత్రువులుగా నివసించే జలవృక రాక్షసులకూ, మాయాసరోవరేశ్వరుడి అనుచరులకూ తెలియని చిన్న రహస్యం ఒకటి వున్నది. ఆయనా, జయశీలుడి లాగే అమరావతీ నగరవాసి!" అన్నాడు.

"అమరావతీ నగరం వాడా, జయశీలుడు! ఆ దేశపు రాజు రుద్రసేనుడు నాకు ప్రబల శత్రువు. నేను కష్టాల్లో వున్నానని తెలిసి, నా మీద యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నట్టు, వేగుల ద్వారా నమ్మకంగా తెలిసింది." అన్నాడు రాజు కనకాక్షుడు కోపంగా.

"మహారాజా, జయశీలుడి నిజాయతీని శంకించకండి. అతడు ఏ దేశపు పౌరుడైనా, తమకు మాట యిచ్చిన మేరకు, యువరాణీ, యువరాజులను వెతికి తెచ్చేందుకు సాయపడతాడు. మీ దేశ పౌరుడుగా నేను యిందుకు మాట యిస్తున్నాను." అన్నాడు సిద్ధ సాధకుడు.

సాధకుడు యిలా మాట్లాడుతూండగా, కొంచెం దూరంలో వున్న నరభక్షకుల గుంపులో కలకలం బయలుదేరింది. దానికి కారణమేమిటా అని సిద్ధసాధకుడు అటువైపు చూసేంతలో, వాళ్ల నాయకుడు

బెబ్బులిదొరా, గణాచారీ అతడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, "మీ లాంటి మనుషులు నలుగురు, పదీ పన్నెండు మంది జలవృక రాక్షసులతో దెబ్బలాడు తున్నారు. మమ్మల్ని సాయం పొమ్మం టారా, యింత ఆహారం అయినా దొరుకు తుంది ?" అన్నారు.

ఆ మరుక్షణం సర్పనఖుడు తన గుర్రం మీద ఎగిరి కూర్చుని, "సాధకా, వాళ్లు వైద్యదేవుడూ, నా తమ్ముడూ, హంసల రథం తోలే రాజుగారి అంగరక్షకుడూ," అంటూ బయలుదేరాడు.



"జై, మహాకాళా!" అంటూ సిద్ధ సాధకుడు నరవానరం భుజాలమీదికి ఎగిరి, రాజు కనకాక్షుడితో, "మహారాజా ముందు ఆ నీటి రాక్షసుల్నుంచి మన వాళ్ళను కాపాడాలి," అంటూ సర్ప నఖుణ్ణి అనుసరించాడు.

"అరణ్యదేవరా, నువ్వే, మా ఆకలి తీర్చాలి!" అంటూ నరభక్షకులు గుంపుగా వాళ్ళ వెంట పరిగెత్తసాగారు.

సర్పనఖుడూ, సిద్ధసాధకుడూ వెళ్ళే సరికి గుర్రం మీద వుండి జలవృకులతో పోరుతున్న సర్పస్వరుడు, తన కత్తితో వాళ్ళను పొడవాలని చూస్తున్నాడు. కాని జలవృకులు ఒడుపుగా తప్పించుకుని వైద్యదేవుడని పిలవబడే దేవశర్మనూ, హంసలరథం తోలేవాణ్ణీ, కుంటి మంగళ వర్మనూ ప్రాణాలతో పట్టుకోవాలని చూస్తున్నారు. కాని, దేవశర్మ, వాళ్ళను తన వజ్రాలు తాపిన చేతికర్రతో అటకా యిస్తూ, "ఒరే, మూఢులారా, జాగ్రత్త! ఈ కర్ర చివర వున్న ముల్లు, విష పూరితం. మీ శరీరాలకు తాకించానో, క్షణాల మీద చచ్చిపోగలరు," అంటూ వాళ్ళను హెచ్చరిస్తున్నాడు.

అంతలో అక్కడికి సిద్ధసాధకుడూ, సర్పనఖుడూ వచ్చారు. దూరంనుంచి కేకలు పెడుతూ నరభక్షకులూ, రాజు కనకాక్షుడి భటులూ కూడా అటే వస్తు న్నారు. వాళ్లను చూస్తూనే వెనుదిరిగి పారి

పోవాలని ప్రయత్నిస్తున్న జలవృక రాక్షసులతో వారి నాయకుడు, "ఆగండి! మన రాజాజ్ఞ, వీళ్ళను ప్రాణాలతో పట్టలేకపోతే, చంపి రమ్మని గదా?" అంటూ ఎగిరి రాతిగదతో దేవశర్మను కొట్టబోయాడు.

దేవశర్మ ఒకడుగు వెనక్కు వేసి, "నీకు చావు రాసిపెట్టి వుండగా, నేనేం చేయగలను!" అంటూ తన చేతికర్రను వాడి శరీరానికి తాకించాడు. ఆ వెంటనే జలవృక రాక్షసుల నాయకుడు ఒక చావుకేక పెట్టి, కిందపడి గిలగిల తన్నుకోసాగాడు.

దేవశర్మ తన చేతికర్రను పైకెత్తి, "ఒరే, ప్రాణాలతో వున్న జలవృకులారా, యిదే నా హెచ్చరిక! సరోవరంలో వున్న మాయాసరోవరేశ్వరుడి కుమార్తె పద్మముఖికిగాని, కాంచనవర్మకుగాని ఏ కొద్ది పాటి హాని జరిగినా, మీ రాజుతోపాటు మిమ్మల్నందర్నీ, దుర్మరణం పాలు చేస్తాను, జాగ్రత్త, వెళ్ళి మీ రాజుతో చెప్పండి!" అన్నాడు.

జలవృక రాక్షసులు హాహాకారాలు చేస్తూ, అరణ్యానికి అడ్డంపడి పారిపోసాగారు. సర్పనఖుడు, దేవశర్మను సమీపించి, గుర్రం దిగి, "వైద్యదేవా! మాయాసరోవరేశ్వరుడూ, కాంచనమాలా, జయశీలుడూ జలవృకరాక్షసుల నుంచి రానున్న ప్రమాదం తెలియక, సరోవరానికేసి పోతున్నారు గదా, వాళ్లను హెచ్చరించవద్దా?" అన్నాడు.

"ఆ పని మీ అన్నదమ్ములూ, హంసల రథం తోలే సరోవరేశ్వరుడి అంగరక్షకుడూ చేయాలి, బయలుదేరండి!" అన్నాడు దేవశర్మ.

సర్పనఖ, సర్పస్వరులు జలాశ్వాలను అదిలించి వేగంగా పరిగెత్తించసాగారు. అంగరక్షకుడు దాపులనున్న చెట్ల వెనక్కుపోయి హంసల రథాన్ని క్షణాలమీద ఆకాశంలోకి ఎగిరించాడు. నరభక్షకులు ఉత్సాహంగా కేకలుపెడుతూ, పారిపోతున్న జలవృకరాక్షసుల వెంటబడి, తరమసాగారు.

—(ఇంకావుంది)





# అఖండ దైవజ్ఞుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్లి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీకు మానవయత్నంలో అపారమైన విశ్వాసం ఉన్నట్టు స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది గాని, దైవ నిర్ణయానికి తిరుగులేదు. ఆ మాట నిరూపించటానికి ఒక అద్భుత జ్యోతిష్కుడి వృత్తాంతం చెబుతాను, శ్రమతెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వసంతదేశపు రాజు గొప్ప వీరుడు. ఆయన రాజ్యానికి వస్తూనే, పొరుగున ఉన్న హేమంత రాజ్యంతో యుద్ధం చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆ యుద్ధంలో అతనికి ఘన విజయం లభించింది. వసంతదేశపు రాజు గద్దె

## బేతాళ కథలు

ఎక్కుతూనే రెండు దేశాలకు రాజు అయాడు.

యుద్ధంలో విజయం లభించిందేగాని ఉభయ దేశాలకూ జననష్టమూ, ధన నష్టమూ అపారంగా జరిగింది. రాజు చూడబోతే మహావీరుడు. దానికి తోడు విజయం చవిచూసి ఉన్నాడు. అందుచేత ఆయన మరికొన్ని దేశాలతో యుద్ధం తలపెట్టవచ్చునని మంత్రి భయపడి ఆస్థాన జ్యోతిష్కుణ్ణి రాజుగారి జాతకం చూసి చెప్పమన్నాడు.

"మహామంత్రీ, మన రాజుగారికి రెండు రాజ్యాలు మాత్రమే ఏలే యోగం ఉన్నది. ఏ కారణంచేతగాని ఆయన మరొకసారి యుద్ధం చెయ్యవలసి వస్తే, అపజయం సంప్రాప్తం కావటమేగాక, రెండు రాజ్యాలూ తప్పక పోతాయి." అని జ్యోతిష్కుడు రాజు వింటూండగా మంత్రితో అన్నాడు.

"నా పరాక్రమం అడవిగాచిన వెన్నెల కావలసిందేనా?" అని రాజు అడిగాడు.

"మహారాజా, యుద్ధాలలో విజయం కేవలమూ రాజు యొక్క శౌర్య పరాక్రమాల మీద ఆధారపడదు. సేనలు సక్రమంగా నడవాలి. వాటికి సరి అయిన నాయకత్వం ఉండాలి. ఒక్క తప్పుడు వ్యూహంతో విజయం అపజయంగా మారవచ్చు. అన్నిటినీ మించి దైవం అనుకూలించాలి. అదే కనబడదు తమ జాతకంలో!" అన్నాడు జ్యోతిష్కుడు.



"మీ ప్రతాపం వృథా పోనేల? ఏటా యుద్ధ విద్యాప్రదర్శనలు ఏర్పాటు చేసి, దేశదేశాల వారిని తమతో పోటీకి ఆహ్వానించి, పేరుమోసిన మహా వీరులను ఓడించండి," అన్నాడు మంత్రి.

రాజు అలాగే చేస్తూ వచ్చాడు. ఆరంభంలో ఇతరదేశపు రాజులు వసంత రాజుతో యుద్ధ విద్యలలో పోటీ చేసి ఓడిపోయారు. వారికి అవమానం అని పించకుండా, వసంతరాజు వారిని ఘనంగా సన్మానించి, గౌరవించి పంపేవాడు. అంతటి బలవంతుడితో సఖ్యంగా ఉండ టానికి అనేకమంది రాజులు గర్వించటమే గాక, అతను తమ మీదికి యుద్ధానికి రానందుకు ఎంతో సంతోషించేవారు.

ఇలా చాలా సంవత్సరాలు గడిచాయి. వసంతరాజు వద్ద ఆస్థాన జ్యోతిష్కుడుగా ఉన్నవాడి తమ్ముడు, పొరుగున వున్న శమంతరాజు ఆస్థానంలో జ్యోతిష్కుడుగా చేరాడు.

వసంతరాజుకు కొడుకులు కలగలేదు, ఒక కుమార్తె కలిగింది. ఆమె యుక్త వయస్కురాలైనాక, అనేకమంది రాజ కుమారులు ఆమెను పెళ్ళాడగోరారు. ఆమె చక్కనిది కావటమేగాక, రెండు సింహాస నాలకు వారసురాలు!

శమంతరాజు యువకుడు. అతను కూడా వసంత రాజకుమారిని పెళ్ళాడ గోరాడు. అయితే అతను దుర్బలుడు. అతని రాజ్యం చిన్నది. అందుచేత అతని



కోరిక ఈడేరే అవకాశం అణుమాత్రం కూడా లేదు. పూర్తిగా నిరాశ చేసుకునే ముందు అతను తన జ్యోతిష్కుడితో సంప్రతించాడు.

జ్యోతిష్కుడు అతని జాతకం చూసి, "మహారాజా, తమరు మూడు రాజ్యాలకు రాజు అయే యోగం ఉన్నది. అందుచేత తమరు ఏం చేస్తారంటే, వసంతరాజుకు తన కుమార్తెను తమరికిచ్చి పెళ్ళి చెయ్యవలసిందనీ, అలా చెయ్యని పక్షంలో యుద్ధానికి సిద్ధం కావలసిందనీ కబురు చెయ్యండి. తరవాత ఏం జరుగుతుందో చూతాం," అని సలహా ఇచ్చాడు.

శమంతరాజు వసంతరాజుకు అలాగే దూత ద్వారా కబురు చేశాడు. వసంతరాజు మారుమాటాడకుండా తన కుమార్తెను శమంతరాజుకిచ్చి వైభవంగా వివాహం చేసేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వసంతరాజులాటివాడు, ప్రతాపంలో తన కాలిగోరుకు పోలని శమంతరాజు బెదిరింపుకు లొంగిపోయి, తన కుమార్తెను అతనికిచ్చి పెళ్లి చేశాడంటే అది దైవికంగా జరిగినదే గదా? లేక వయసు మళ్ళిన కారణం చేత అతనికి తన ప్రతాపంలో విశ్వాసం పోయిందా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వసంతరాజుకు జ్యోతిషంలో గుడ్డి నమ్మకం ఉన్నది. అందుకే అతను శమంతరాజుతో యుద్ధానికి దిగలేదు. అతనికి తన జాతకంలో అంత నమ్మకం ఉండబట్టే అతను మూడో దేశాన్ని జయించే యత్నం చెయ్యలేదు. శమంత అస్థానజ్యోతిష్కుడికి ఆ రహస్యం తెలుసును. అందుకే అతను శమంతరాజుకు అలా సలహా ఇచ్చాడు. ఇందులో దైవికంగా జరిగినది ఏమీలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# సోదరప్రేమ

ఒక రాజు దగ్గిర కొందరు బానిసలు పనిచేస్తూండేవారు. ఒకసారి ఖజానాలో ధనం తరిగి పోయింది. దాన్ని సరిచేయడం కోసం ఒక్కొక్క బానిస కష్టపడి సంపాదించి, వెయ్యి రూపాయలనిస్తే, రాజు విడుదల చేస్తానన్నాడు.

బానిసలలో ఇద్దరు అన్నదమ్ములున్నారు. తమ్ముడు బలహీనుడు. అన్న బలశాలి. అతను బాగా కష్టపడి శ్రమించి, వెయ్యి రూపాయలు చేర్చి రాజుకిస్తూ, "ఇది తీసుకుని మా తమ్ముణ్ణి విడుదల చెయ్యండి," అన్నాడు.

"నువు శ్రమపడి సంపాదించినది నీ తమ్ముడికి ఎందుకు ఉపయోగిస్తున్నావు?" అని రాజు అడిగాడు.

"నా తమ్ముడు దుర్బలుడు, పనిచెయ్యలేడు. నేను ఇంకా పనిచేసి నా విడుదల కూడా పొందగలను. నేను విడుదలైపోతే నా తమ్ముడి సంగతి ఎవరు చూస్తారు?" అన్నాడు అన్న.

రాజు అతని సోదర ప్రేమ చూసి, డబ్బు తీసుకోకుండానే అన్నదమ్ములను విడుదల చేశాడు.





శ్రీపురం సుభిక్షమైన గ్రామం. ఊళ్లో నిత్యమూ ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి తాండ విస్తూండేవి. ఊరి పెద్ద రావుబహదూర్ జమీందారుగారు. ఊళ్లో అతని మాటకు ఎదురులేదు. ఎవరింట ఏ సమస్య ఏర్ప డినా రావుగారి చేతిమీదుగా అది పరి ష్కారం కావలసిందే. గ్రామస్థులు నిరక్ష రులు కావటం చేత ఆ గ్రామానికి అమ రిన సదుపాయా లన్నిటికీ జమీందారు గారే బాధ్యుడని చెప్పాలి.

అలా ఏర్పడిన సదుపాయాలలో ఒకటి అమ్మవారి గుడి. ఆ దేవాలయం నిర్మా ణంలో ప్రతి గ్రామస్థుడి సొమ్మూ అంతో ఇంతో పడింది. గ్రామస్థులు ఏటా ఇచ్చిన చందాలతో అమ్మవారికి దాదాపు లక్ష రూపాయలు విలువ చేసే నగకట్టు ఏర్పడింది. అమ్మవారిని అలంకరించిన రోజున, చుట్టుపట్ల కొన్ని ఆమడల దూరం నుంచి జనం వచ్చి, ఎగబడేవారు. జమీందారు రావుగారి ధర్మమా అంటూ ఆ ప్రాంతాల అంత గొప్ప గుడి లేదు. గుడి లోపల విలువైన నగ కట్టు ఉన్న కారణంచేత గుడికి బలమైన తాళం ఉండేది. దాని తాళపుచెవి గుడి తెరిచి ఉన్నప్పుడు పూజారి వద్దా, మిగతా వేళల జమీందారుగారి వద్దా ఉండేది. దేవా లయంతో రావుగారి కీర్తి మిన్నుముట్టింది. గ్రామస్థులకు ఆయన అమ్మవారి ప్రతినిధి లాగా కనిపించేవాడు.

ఉన్నట్టుండి ఒక రాత్రి అమ్మవారి నగలు మాయమయాయి. గుడి తలుపులు తెరుస్తూనే ఈ సంగతి గమనించిన పూజారి తల బాదుకున్నాడు. ఆయన వెళ్ళి రావుగారితో ఈ మాట చెబితే, రావు గారు తన చెవులను తానే నమ్మలేక పోయాడు. ఆయన పై బట్టకూడా వేసుకో

బుర్లె నాగేశ్వరరావు

కుండా గుడి కేసి పరిగెత్తాడు.

ఈ సంగతి ఊరంతా గుప్పుమన్నది. ఊరివారు అందరూ గుడి దగ్గిర చేరారు. అందరి ముఖానా విచారం తాండవిస్తున్నది. అందరూ ఎంతో భక్తితో చందాలు వేసుకుని, అమ్మవారి కోసం చేయించిన లక్షరూపాయల నగలు మాయమయాయంటే మాటలా? జమీందారూ, పూజారీ తప్ప ఆ నగలను మరో మనిషి తాకలేదు. వాళ్లు దొంగతనం చేశారంటే ఆ ఊళ్లో రాళ్లూ, రప్పలూ కూడా నమ్మవు. మూడోవాడెవడో దొంగిలించాడంటే దొంగతనం ఎలా జరిగినదీ ఊహించటానికి కూడా వీలులేకుండా ఉన్నది!

జమీందారు జనాన్ని తోసుకుంటూ అమ్మవారి విగ్రహం ముందుకు వచ్చి, చేతులెత్తి దణ్ణంపెట్టి, "తల్లీ, ఇదేమి దురన్యాయం! మేమంతా ఏం పాపం చెయ్యటంచేత ఈ ద్రోహం జరిగింది? ఈ దొంగతనం చేసినవాడు ఎవడో నువ్వే చెప్పాలి. వాణ్ణి ముక్కలు, ముక్కలుగా నరికిస్తాను," అన్నాడు ఆవేదనతో.

విచిత్రంగా అమ్మవారి విగ్రహం నుంచి మాటలు వినిపించాయి: ''భక్తుడా, నా మీది భక్తితో మీకు ఉన్న తెలివికూడా పోతున్నది. నా నగలు దొంగిలించినవాడు మీలోనే ఉన్నాడు. వాడు చాకలి పేరి



గాడు. కాని వాణ్ణి ఏమీ అనకండి. వాడు అమాయకుడు.''

పేరిగాడి పేరు వినగానే అందరికీ అరికాలిమంట నెత్తికొచ్చింది. అదివరకు వాడు చిన్న చిన్న దొంగతనాలు చేసి, బయటపడి, తన్నులు తిని ఉన్నాడు. కాని, ఇంత పెద్ద దొంగతనం చేస్తాడా! అందులోనూ అమ్మవారిసొత్తు!

వెంటనే చాకలి పేరిగాణ్ణి బరబరా ఆలయానికి లాక్కొచ్చారు. వాడు తన మీదికి వచ్చిన నేరం విని, ''నా కేమీ తెలీదు, బాబూ!" అని కేకలు పెట్టాడు.

జమీందారు వాడి పీక పట్టుకుని, ''ఒరే, అమ్మవారు నిన్నేమీ అనేవద్దన్నది.



అంతటి దయగల తల్లి సొత్తు అపహరిస్తావా? ఎక్కడ దాచావో చెప్పు," అని అడిగాడు.

ఎన్నివిధాల అడిగినా పేరిగాడు దొంగతనం చేశానని ఒప్పుకోలేదు. చివరకు జమీందారు వాణ్ణి గుడిలోకి నెట్టి, "జాగ్రత్తగా ఆలోచించుకో. అమ్మవారికి ఆగ్రహం తెప్పించావంటే నెత్తురు కక్కుకుని చస్తావు!" అని పేరిగాణ్ణి హెచ్చరిస్తూ, గుడికి తాళం వేశాడు.

మర్నాడు జమీందారు స్వయంగా వచ్చి, గుడి తలుపులు తెరిచేసరికి, పేరిగాడు నెత్తురు మడుగులో చచ్చిపడి ఉన్నాడు. నగల ఆచూకీ పేరిగాడి ద్వారా తెలుస్తుందని ఆశించిన ఊరి వాళ్లకు ఆశాభంగ మయింది.

శవాన్ని బయటికి తీసి, గుడిని శుభ్రంగా కడిగించి, పుణ్యాహవాచనం చేశారు.

కొంత కాలం గడిచినాక రావుగారు అందరినీ సమావేశపరిచి, "చూడండి, జరిగినదేదో జరిగిపోయింది. పోయిన నగలూ, పేరిగాడి ప్రాణాలూ మళ్లీ రావు. రాత్రి అమ్మవారు బోసి మెడతోనూ, బోసి చేతులతోనూ నాకు కలలో కనిపించి, 'నన్నిలాగే ఉంచుతారట్రా? మళ్ళీ నాకు నగలు పెట్టండి!' అన్నది. వంద రాళ్లు పేర్చితే ఒక గుట్ట అవుతుంది. ఏమంటారు?" అన్నాడు.

మళ్ళీ చందాలు వేసుకుని, అమ్మవారికి నగలు ఏర్పాటు చేయటానికి అందరూ ఒప్పుకున్నారు. త్వరలోనే అమ్మవారికి నగలు ఏర్పడ్డాయి.

కాని ఏడాది తిరగకుండానే అమ్మవారి నగలు మళ్ళీ మాయమయాయి. ఊరు అట్టుడికి పోయింది. గ్రామానికి ఏదో చేటు దాపరించిందనీ, మళ్ళీ ఎవరికో మూడిందనీ అనుకుంటూ గ్రామస్థులు దేవాలయం వద్దకు చేరారు.

రావుగారు దేవతకు చేతులెత్తి నమస్కరించి, "తల్లీ, నీ నగలు మళ్ళీ కాపాడ

లేకపోయాం. ఎందుకు మమ్మల్ని ఇలా శిక్షిస్తున్నావు? ఈసారి ఇలాటి సాహసానికి ఒడిగట్టిన దుర్మార్గుడెవరు? దయచేసి చెప్పు!'' అని వేడుకున్నాడు.

అమ్మవారు పలకలేదు.

జమీందారు ఆత్మహత్యకు తలపడి, బొడ్డులోనుంచి చురకత్తి తీసి, తనను తాను పొడుచుకోబోయాడు. అందరూ హాహాకారాలు చేశారు. అంతలో విగ్రహం నుంచి మాటలు వినబడ్డాయి :

''నువు చావకు! ఈ ఊరినుంచి నేనే పోవాలనుకుంటున్నాను. మీలో దుర్మార్గులున్నారు. ఈసారి నగలు కాజేసిన వాడు చాకలి బుచ్చిగాడు.''

బుచ్చిగాడి పేరు వింటూనే కొందరు వాడి కోసం పరిగెత్తారు.

రావుగారు మిగిలినవాళ్లతో, ''బుచ్చిగాణ్ణి ఎవరూ ఏమీ అనవద్దు. ఈసారి వాడు నగల జాడ చెప్పకుండా చావగూడదు. మళ్ళీ లక్షరూపాయల నగలు మనం తేగలమా?'' అన్నాడు.

కాని ఆయన అనుకున్నట్టు జరగలేదు. బుచ్చిగాడి కోసం వెళ్ళినవాళ్ళు తిరిగి వచ్చి, బుచ్చిగాడు క్రితం రాత్రే బలవన్మరణం పొందినట్టు చెప్పారు.

ఈ మాట వింటూనే రావుగారు కుప్పకూలిపోయాడు. ఆయనకు స్పృహతప్పి,



ఎన్ని శైత్యోపచారాలు చేసినా తెలివి రాలేదు. చివరకు గ్రామస్థులు మళ్ళీ చందాలు వేసుకుని అమ్మవారికి నగలు చేయిస్తామని మొక్కుకున్నాకనే ఆయన కళ్లుతెరిచాడు.

వాళ్లు ఇలా మొక్కుకున్నామని చెప్పగానే రావుగారు వాళ్లను మందలిస్తూ, ''మీకేమైనా మతిపోయిందా? నా ఒక్కడి ప్రాణం కోసం మీ ఇళ్లన్నీ గుల్ల చేసుకుంటారా?'' అన్నాడు.

''అదేం మాటండీ! మీరు చల్లగా ఉంటేనే గద మాకు ఇళ్లూ, వాకిళ్లూనూ!'' అన్నారు గ్రామస్థులు.

అమ్మవారికి మూడోసారి నగలు ఏర్ప



డ్డాయి. కాని ఈ నగలు పోవన్న నమ్మకం ఎవరికీ లేదు.

పూజారి కూతురు వాణి చాలా చురుకైనపిల్ల. ఆమె మోసం జరుగుతున్నదనీ, అమ్మవారు పలకటం అసంభవమనీ గ్రహించింది. బంగారం మాయమైన తరవాత దొంగగా చెప్పబడిన వాళ్ళు చావటం కూడా ఆమెకు అనుమానాస్పదంగానే తోచింది. ఎవరో దేవతను అడ్డుపెట్టుకుని నాటకమాడుతున్నారు. వాణి ఈ మాట అంటే, పూజారి ఒప్పుకో లేదు. అతనికి అమ్మవారిలో అపారమైన విశ్వాసం.

ఈ సమయంలో చిన్నడు తన కుక్కతో ఆ ఊరు వచ్చాడు. ఊళ్లో వాణ్ణి గురించి అదివరకే విని ఉన్నవాళ్ళు వాడికి స్వాగతం చెప్పారు.

చిన్నడు తిన్నగా వచ్చి, గుడిలోనే మకాం పెట్టాడు. వాణ్ణి గురించి వాణి కూడా విని ఉన్నది. అందుచేత ఆమె గుడికి వచ్చి, వాణ్ణి పలకరించి, వాడికి జరిగినదంతా చెప్పింది. అంతా చెప్పి ఆమె, ''నువు ఈసారి నగలు పోకుండా చూడాలి. అంతేకాదు, అసలు దొంగను బయటపెట్టాలి. లేకపోతే మళ్ళీ నగలు పోవటమేగాక, మరొక అమాయకుడి ప్రాణాలుకూడా పోతాయి,'' అన్నది.

చిన్నడు కాస్సేపు ఆలోచించి, ''గుడి తాళాలు ఎవరి దగ్గిర ఉంటాయి ?'' అని అడిగాడు.

''మా నాన్న రోజూ సాయంకాలం అమ్మవారికి దీపారాధన చేసి, తాళంవేసి, తాళపు చెవులను జమీందారు కిస్తాడు,'' అన్నది వాణి.

''ఇంకేం ? ఈ రోజు దీపారాధన నువు చెయ్యి. తాళాలు తెచ్చి, నగలన్నీ జాగ్రత్తగా దాచెయ్యి. మీ నాన్నకు అనుమానం కలగకుండా ఈ పని చేశావంటే, మిగిలినది నేను చూస్తాను,'' అంటూ చిన్నడు తన పథకం అంతా వాణికి వివరించాడు.

వాణి ఆ రోజు దీపారాధన చేస్తానంటూ తాళపు చెవులతో గుడికివెళ్ళి, పరిగెత్తి రొప్పుతూ తండ్రి వద్దకు తిరిగి వచ్చి, ''నాన్నా, అమ్మవారి నగలు మళ్ళీ మాయమయ్యాయి. చూద్దువుగాని, రా." అన్నది.

పూజారి ఆదరా బాదరా గుడికి వెళ్ళి, అమ్మవారి నగలు మాయం అయిన సంగతి కళ్లారా చూసి, రావుగారి వద్దకు వెళ్ళి ఆ వార్త చెప్పాడు. రావుగారి కళ్లు చింతనిప్పుల్లా అయాయి. ఆయన గుడికి వచ్చి చూశాడు. నగలు లేనిమాట నిజమే.

''పట్టపగలే నగలు మాయం అయాయంటే, నీకు తెలీకుండా ఎలా జరిగింది ?'' అంటూ ఆయన పూజారీనీ చురచురా చూశాడు. పూజారికి నాలుక పిడచకట్టుకు పోయింది. రావుగారు అటూ ఇటూ పచార్లు చేస్తూ ఆలోచించసాగాడు.

క్షణాలమీద వార్త ఊరంతా పాక్కింది. మళ్లీ ఎవరికో చావుమూడింది! దొంగతనం చేసినవాడు చస్తున్నా ఇంకా దొంగతనం జరుగుతూనే ఉన్నది! ఎంత ధైర్యం! అమ్మవారితో చెలగాటమా ?

ఆ రాత్రి గడవనిచ్చి, మర్నాడు తెల్లవారగానే జనం గుడి దగ్గిర చేరారు. రావుగారు దొంగ ఎవరని అమ్మవార్ని అడిగాడు. అమ్మవారు మళ్ళీ పలికింది :



''ఇకమీద నేను పలికేది లేదు. మీలో పరమదుర్మార్గులున్నారు. ఇంక నాకు నగలు చేయించబోమని మాట ఇస్తే దొంగ పేరు చెబుతాను."

అందరూ అమ్మవారి మాటకు సరేనన్నారు. ''ఈసారి నా నగలు పట్టపగలే దొంగిలించిన వాడు కుమ్మరి నాగులు,'' అన్నది అమ్మవారు.

వెంటనే కొందరు వెళ్ళి, కుమ్మరి నాగుల్ని బరబరా ఈడ్చుకొచ్చారు. అక్కడే ఉన్న చిన్నడు జనంతో, ''ఉండండి, ఉండండి! ఎందుకో ఈ సారి అమ్మవారు అబద్ధమాడింది. అసలు సంగతి నేను తేల్చుతాను,'' అంటూ

విగ్రహం కేసి తిరిగి, "చూడు, తల్లీ, జాగ్రత్తగా ఆలోచించుకుని మరీ చెప్పు! నగలు తీసిననాడు నిజంగా నాగులే నంటావా ?" అన్నాడు.

విగ్రహం నుంచి కోపంగా మాటలు వినిపించాయి :

"ఎవడు వాడు? నన్నే శంకిస్తున్నాడు. ముందు వాణ్ణి శిక్షించండి!"

మరుక్షణం జనం చిన్నడి మీదికి ఉరికారు. వాణి వాళ్లని ఆగమని, "అమ్మవారు చెప్పినది పచ్చి అబద్ధం. నగలు నావద్ద ఉన్నాయి. వాటిని తీసినది నేను!" అంటూ తన చేతిలో ఉన్న మూట విప్పి, అక్కడ పెట్టింది.

అందరూ నిర్ఘాంతపోయారు. అమ్మవారు ఎందుకిలా అబద్ధం చెప్పింది? వాళ్లు ఒకరి మొహాలు ఒకరు చూసుకోవటం గమనించి చిన్నడు, "ఇలా అబద్ధాలు చెప్పే దేవతలను నేను ఎరుగుదును. ఈ అమ్మవార్ని మీకు ప్రత్యక్షంగా కూడా చూపగలను," అంటూ కుక్కను విగ్రహంవేపు ఉసికొల్పాడు. కుక్క వెళ్ళి, విగ్రహం వెనక ఉన్న మనిషిని ఇవతలికి లాక్కొచ్చింది. ఆ మనిషి రావుగారి పాలేరు పెళ్లాం!

నిజం చెప్పకపోతే చంపేస్తామని బెదిరించిన మీదట అది, నగలు ప్రతిసారీ కాజేస్తున్నది జమీందారేననీ, తనను విగ్రహం చాటున ఉంచి అతను చెప్పమన్న విధంగా చెప్పిస్తున్నాడనీ బయట పెట్టింది.

ఈలోపల రావుగారు అక్కడినుంచి జారుకున్నాడు. చిన్నడు జనాన్ని తీసుకుని రావుగారింటికి వెళ్లేటప్పటికి ఆయన తాను కాజేసిన అమ్మవారి నగలతో పరారీ అయే ప్రయత్నంలో ఉన్నాడు.

కుక్క సహాయంతో చిన్నడు నగలను రావుగారి నుంచి లాక్కుని, ఆయనను ఊరువిడిచి పోనిచ్చాడు. తరవాత ఊరివాళ్ల ఆదరాభిమానాలు అందుకుని, చిన్నడు కూడా తన కుక్కతో మరో గ్రామానికి బయలుదేరాడు.



# పందెం

ఒక రాజుకు పందాలు వేసే వ్యసనం ఉండేది. రోజూ కొలువులోకి వస్తూనే, సభలో తనతో పందెం కాచేవాడుంటే లేచి నిలబడమనేవాడు.

ఒకనాడు ఆయన సభలోకి అడుగుపెట్టి ఇలా అనేసరికి, ఒక యువకుడు, "మహారాజా, నేను పందెం పెడతాను. మీరు ఓడినా, నేను ఓడినా వంద బంగారు నాణాలు ఇచ్చుకోవాలి," అన్నాడు.

రాజు సరేనని, పందెం చెప్పమన్నాడు.

"మీ కుడిచేతి చిటికెన వేలి ఉంగరం కింద పెద్ద పుట్టుమచ్చ ఉన్నది. కావలిస్తే తీసి చూడండి," అన్నాడు యువకుడు.

రాజు తీసి చూశాడు. పుట్టుమచ్చ లేదు. యువకుడు రాజుకు వంద బంగారు నాణాలు ఇచ్చి వెళ్ళిపోతుండగా సభలో హాహాకారాలు చెలరేగాయి. ఏమిటని రాజు విచారిస్తే, సభలో వాళ్ళు ఆ యువకుడితో ఉమ్మడిగా పదివేల బంగారు నాణాలు పందెం కాచారట. రాజుగారి కుడి చిటికెన వేలి ఉంగరం తీయిస్తానని అతను అన్నాడట. పందెం గెల్చుకున్నాడు.

—ఎం. బాషా మొహిద్దీన్.





# పాపిష్టి డబ్బు

చెంగయ్య సంపాదన అతనికి బొటా బొటీగా సరిపోయేది. అతని స్నేహితుడు వెంకటయ్య మటుకు వ్యాపారంలో చాలా గడించి, పెద్ద ఇల్లు కట్టుకున్నాడు. చెంగయ్య అప్పుడప్పుడూ వెంకటయ్య ఇంటికి వెళ్ళి, కబుర్లాడి వస్తూండేవాడు.

ఒకరోజు చెంగయ్య వెళ్ళినప్పుడు వెంకటయ్య అతనికి ఒక దుర్వార్త చెప్పాడు. వాళ్ళ కిద్దరికీ స్నేహితుడైన రమణయ్య ఇల్లూ, దుకాణమూ ఒకేసారి కాలిపోయి, అతను బికారి అయాట్ట.

ఈ మాట విని చెంగయ్య ప్రాణం కొట్టుకుపోయింది. రమణయ్య వ్యాపారం కోసం పట్నంలో స్థిరపడిపోయి, తన చిన్ననాటి మిత్రులకు దూరమయాడు.

"ఎంత ఘోరం! పాపం, రమణయ్యను చూసివద్దాం, పద," అన్నాడు చెంగయ్య వెంకటయ్యతో.

వెంకటయ్య నవ్వి, "ఇది మరీ బాగుంది! ఈ స్థితిలో మనం వెళితే రమణయ్య డబ్బు అడగడూ?" అన్నాడు.

చెంగయ్య నిర్ఘాంతపోయి, "డబ్బు పాపిష్టిది. స్నేహం పవిత్రమైనది. రెంటికీ లంకెపెడతావేం?" అన్నాడు ఆవేశంగా.

"డబ్బు లేదు గనక ఎన్ని కబుర్లయినా చెబుతావు. నేను రాను. కావలిస్తే నువు వెళ్ళు," అని చెప్పేశాడు వెంకటయ్య.

అప్పటికి చీకటి పడింది. అయినా చెంగయ్య ప్రాణం నిలవక, అడ్డదారిన పట్నానికి బయలుదేరాడు. రాత్రంతా నడిస్తే తెల్లవారేసరికి పట్నం చేరవచ్చు.

అయితే అర్ధరాత్రి అయేసరికి మబ్బులు కమ్మి, గాలివాన ఆరంభమయింది. అదృష్టవశాన అతనికి ఒక గ్రామం తగిలింది. వానలో తడిసి ముద్ద అయి అతను ఒక ఇంటి తలుపు తట్టాడు.

మాచిరాజు కామేశ్వరరావు

ఒక ముసలిది కిటికీలో నుంచి తొంగి చూసి. ''ఎవరు వారు ?'' అన్నది.

''నేను పట్నం వెళుతున్నాను, అవ్వా. దారిలో వర్షం పట్టుకున్నది. కాస్త తెల్ల వారినదాకా తల దాచుకుంటాను, తలుపు తియ్యి.'' అన్నాడు చెంగయ్య.

''కొడుకూ, కోడలూ ఊరెళ్లారు. ఒంటరిగా ఉన్నాను. ఎవరొచ్చినా తలుపు తియ్యొద్దన్నారు. కాని, పాపం, నువు వర్షంలో తడిసిపోతున్నావు. తలుపు తీస్తాను ఉండు,'' అన్నది ముసలిది.

ఆమె తలుపు తీయకుండా - లోపలికి వెళ్ళిపోవటం చూసి చెంగయ్య పెరటి వేపు వెళ్ళి, కిటికీలోనుంచి ముసలిది చేస్తున్న పని చూశాడు. ఆమె పెట్టెలో నుంచి బోలెడు డబ్బు తీసి ఒక సంచీలో వేసి, పైన చింతపండు వేసి, సంచీని మేకుకు తగిలించి, పెట్టె మూసింది.

ఆమె వచ్చి తలుపు తెరిచేలోపల చెంగయ్య ముందువాకిలి వద్దకు వచ్చి నిలబడ్డాడు. ఆమె తలుపు తెరిచి, చెంగయ్యకు కట్టుకోను పొడిబట్టలిచ్చి, వీధి గదిలో అతను పడుకునేటందుకు నులక మంచం వాల్చింది.

చెంగయ్య పడుకున్నాడుగాని నిద్ర పోలేదు. ముసలిదాని సంచీలో ఉన్న డబ్బుతో రమణయ్య తిరిగి వ్యాపారం ప్రారంభించి, త్వరలోనే బాకీ వడ్డీతో



సహా తీర్చెయ్యవచ్చు.

ముసలిది గురుకపెట్టి నిద్రపోతున్నది. బయట వాన నిలిచిపోయింది. చెంగయ్య లేచి లోపలికి వెళ్ళి, డబ్బుసంచీ భుజాన తగిలించుకుని, తిరిగి ప్రయాణమయాడు.

అతను బాగా తెల్లవారి రమణయ్య ఇల్లు చేరాడు. ఆ ఇల్లు తాలూకు బూడిద కుప్పలే అతనికి కనపడ్డాయి. చెంగయ్య కంటతడి పెట్టి, రమణయ్యను ఓదార్చ యత్నించాడు.

చెంగయ్య సంచీలో డబ్బు రమణయ్య ముందు పోసి, ''దీనితో వ్యాపారం చేసి మళ్ళీ పైకిరా,'' అన్నాడు.

‘‘ఈ డబ్బు నీది కాదు. పరామర్శించటానికి రాని వెంకటయ్య పంపాడనుకోను. నిజం చెప్పు. ఇది నీకు ఎక్కడిది?’’ అని రమణయ్య అడిగాడు.

చెంగయ్య జరిగినదంతా దాచకుండా రమణయ్యకు చెప్పి, ‘‘ఆరు నెలల్లో ముసలిదానికి రెట్టింపు డబ్బు తిరిగి ఇయ్యవచ్చు. సందేహించకు,’’ అన్నాడు.

రమణయ్య కంట తడి పెట్టుకుంటూ, ‘‘నా మీద నీకున్న అభిమానానికి చాలా సంతోషమే గాని, చెంగయ్యా, ఈ డబ్బు నాకు వద్దు. నేను ఇన్నాళ్లూ చాలా అన్యాయాలు చేసి డబ్బు గడించాను. నా వ్యాపారమంతా దగా వ్యాపారమే. అందుకే తుడిచిపెట్టుకు పోయింది. నే నిప్పుడు మరో శెట్టి దగ్గిర ఉద్యోగానికి కుదిరాను. నా సంపాదనతో మా సంసారం వెళ్ళిపోతుంది. ఇది పాపిష్ఠి డబ్బు! కాకపోతే నీవంటి సజ్జనుణ్ణి దొంగతనానికి ప్రేరేపించదు. ఈ డబ్బు ముసలిదానికి తిరిగి ఇచ్చెయ్యి,’’ అన్నాడు.

చెంగయ్య తన స్నేహితుడి స్థితి మరీ అధ్వాన్నంగా లేదని తృప్తిపడి, ఆ రోజు మధ్యాన్నం డబ్బు సంచీతో తిరుగు ప్రయాణం అయాడు. అతను ముసలిదాని ఇంటికి చేరేసరికి ఇంటిదగ్గిర చాలా మంది జనం పోగై ఉన్నారు. ముసలిది అరుగుమీద కూర్చుని ఏడుస్తున్నది.

దాని కోడలు, ‘‘అన్నీ అబద్ధాలు! డబ్బు దాచేసుకుని, ఎవడో ఎత్తుకు పోయాడంటున్నది. దొంగకు చింతపండు సంచీలో డబ్బు ఉంటుందని ఎలా తెలుస్తుంది? ఇక ఈవిడ ఇంట్లో క్షణం ఉండటానికి వీల్లేదు!’’ అని ఆవేశంగా అరుస్తున్నది.

ముసలిదాని కొడుకు నిస్సహాయుడై నిలబడి ఉన్నాడు.

ముసలిదాని దుస్థితి చూసి చెంగయ్య డబ్బు సంచీ ఇచ్చి, జరిగినది చెప్పాకనే వాళ్లు ముసలిదాన్ని లోపలికి రానిచ్చారు.

చెంగయ్య ఇంటికి తిరిగి పోతూ, ‘‘డబ్బు పాపిష్ఠిదే!’’ అనుకున్నాడు.



# అసూయ

కృష్ణాపురంలో ఇద్దరు పండితులు గురుకులాలు నడిపేవారు. వారిలో ప్రవరుడు అనే అయన తన శిష్యులకు ఎంతో శ్రద్ధతోనూ, వాత్సల్యంతోనూ విద్య చెప్పి, సాధ్యమైనంత త్వరగా వాళ్ళ చదువు పూర్తిచేసి పంపేస్తుండేవాడు.

విదురుడు అనే రెండో అయన శిష్యులచేత చాకిరీ చేయించుకుని, చదువు చెప్పేవాడు కాడు. ఆయన శిష్యుల చదువు ఎంతకీ పూర్తి అయేది కాదు. అందుచేత ఆయన వద్దకు శిష్యులు వచ్చేవారు కారు.

విదురుడు అసూయపడి, రాజు వద్దకువెళ్ళి, ప్రవరుడు శిష్యుల వద్ద డబ్బుపుచ్చుకుని, వారి చదువు పూర్తి కాకుండానే యోగ్యతాపత్రాలనిచ్చి పంపేస్తున్నాడని ఫిర్యాదు చేశాడు. రాజు ఇద్దరినీ రమ్మని కబురు పంపాడు.

ప్రవరుడు తనపై వచ్చిన ఆరోపణల పత్రం చదువుకుని, గుర్రపు బండీపై దివాణానికి వెళ్ళాడు. విదురుడు కూడా చాలా ఉత్సాహంగా ఎద్దు బండిమీద బయలుదేరాడు.

సాక్షికన్న నిందితుడే ముందు రావటం చూసి రాజు విచారణ వాయిదా వేద్దామను కున్నాడు.

"మహారాజా, విదుర పండితులవారూ, నేనూ ఒకేసారి బయలుదేరాం. అయితే వారు ఒంటెద్దుబండి మీద వస్తున్నారు. నేను గుర్రపుబండిలో వచ్చాను. విద్యార్థుల సంగతి కూడా అంతే. చురుకు గల వాళ్ళు ముందు ఉత్తీర్ణులై, యోగ్యతా పత్రాలు పొందుతారు." అన్నాడు ప్రవరుడు.

రాజుకు విషయం అర్థమై, ఆయనను తన ఆస్థానగురువుగా నియమించి, అసూయ పడినందుకు విదురుడి భరణం రద్దుచేశాడు.

—మారుపాక మంజురాణి.





# రెండు గండాలు

వెంకటాపురంలో భీమన్న అనే చిన్న రైతు, చిన్నతనంలోనే తండ్రి పోగా, తల్లి అండన పెరిగాడు. తల్లి కామాక్షమ్మ అతన్ని క్రమశిక్షణతో పెంచి, కమల అనే చక్కని చుక్కను తెచ్చి వాడికి పెళ్ళి చేసింది.

అయితే కామాక్షమ్మ క్రమంగా కోడలిని రాచి రంపాన పెట్టసాగింది. తల్లికి ఎదురు చెప్పలేని భీమన్న, తన భార్య పడే హింసలు చూసి సహించటమే గాక, భార్యను ఓదార్చే శక్తి కూడా లేనివాడయాడు. ఆ ఇంట్లో కమల దిక్కులేనిదై పోయింది.

ఈ స్థితిలో భీమన్న చెల్లెలు గర్భవతిగా ఉండి, కాన్పుకు పుట్టింటికి వచ్చి చేరింది. ఆమె తల్లితో బాటు తానుకూడా కమలని అరళ్లు పెట్టడం మొదలు పెట్టింది. కమలకు బ్రతుకు మరింత దుర్భరమయింది.

ఒకసారి కమల అన్న చెల్లెలిని చూడ వచ్చి, ఆమె ఏమీ చెప్పకుండానే పరిస్థితి గ్రహించి, చాలా బాధపడ్డాడు. ఆమె కాపరం ఎలాగైనా చక్కదిద్దాలన్న ఉద్దేశంతో అతను చెల్లెల్ని ఓదార్చి, ఆమె అత్తను గురించీ, ఆ ఇంటిని గురించీ వివరాలు తెలుసుకుని, చెల్లెలికి ఒక ఉపాయం చెప్పి వెళ్ళిపోయాడు.

తరవాత రెండు రోజులకు ఒక జ్యోతిష్కుడు కామాక్షమ్మ ఇంటి వైపుగా వచ్చాడు. కామాక్షమ్మకు జోస్యం పిచ్చి చాలా ఉన్నది. ఆమె జ్యోతిష్కుణ్ణి లోపలికి పిలిచి, తన చెయ్యి చూడమన్నది.

జ్యోతిష్కుడు ఆమె హస్త రేఖలను చాలాసేపు పరీక్షించి, ఏమీ అనకుండా అక్కడినుంచిలేచి, వెళ్లిపోయే ప్రయత్నం చేశాడు.

బొమ్మిడి అచ్చారావు

''ఏం, నాయనా? ఏం చెప్పకుండా వెళ్లిపోతున్నావు? నీకు తగిన విధంగా సంబారం ఇస్తాలే," అని కామాక్షమ్మ అతన్ని నిలవేసింది.

''అమ్మా, క్షమించాలి. నిజం చెప్పి, మిమ్మల్ని బాధపెట్టటానికి నోరు రాదు,'' అన్నాడు జ్యోతిష్కుడు.

''ఫరవాలేదు, చెప్పు. ఉన్నమాట చెప్పటానికి సంకోచం దేనికి?" అన్నది కామాక్షమ్మ.

''అమ్మా, నీకు రెండు గండా లున్నాయి. మొదటిది తప్పినా, రెండోది తప్పటం కష్టం,'' అని జ్యోతిష్కుడు మరి చెప్పలేదు.

కామాక్షమ్మ ''గండం'' అన్నమాట విని తారెత్తింది. అయినా బింకంగా, ఆ గండాలేమిటో చెప్పితీరాలనిపట్టుబట్టింది.

''నీ కూతురికి పుట్టబోయే బిడ్డవల్ల నీకు గండం ఉన్నది. ఆ బిడ్డకు పదేళ్లు వచ్చేదాకా నువు చూడకుండా ఉంటే ఆ గండం తప్పుతుంది. కాని ఒక నెల రోజుల్లో నీకు పాము గండం ఉన్నది. నాగవశీకరణమంత్రం తెలిసిన మనిషి నీ కోసం నెలరోజులు పూజలు చేస్తే తప్ప ఈ గండం తప్పే మార్గంలేదు. వచ్చేనెల ఇదే తిథినాడు నీకు పాము గండం,'' అని చెప్పి, జ్యోతిష్కుడు వెళ్ళిపోయాడు.

కామాక్షమ్మకు ప్రాణభయం దయ్యంలా పట్టుకున్నది. ఆమె పరిస్థితి



చూసి కమల జాలిపడి, "అత్తయ్యా, మనం చాలా అదృష్టవంతులం. నాకు నాగవశీకరణమంత్రం తెలుసు. ఈ నెలరోజులూ నేను పూజలు చేసి, నీకు పాముగండం రాకుండా చూసుకుంటాను," అన్నది.

అకస్మాత్తుగా కోడలు కామాక్షమ్మకు దేవతలా కనబడింది.

"అలా చెయ్యి, తల్లీ. నీకు నాగవశీకరణమంత్రం తెలుసునని నా కింత కాలమూ తెలీదు. నీ మాట వినగానే పోయినప్రాణం తిరిగి వచ్చినట్టుగా ఉన్నది," అని ఆమె కోడలి మీద ఎంతో అభిమానం ఒలకబోసింది.

పోతే, మొదటి గండం సంగతి చూసుకోవాలి. కామాక్షమ్మ కూతురు ఇవాళో, రేపో కనేటట్టుగా ఉన్న నిండు చూలాలు. కామాక్షమ్మ నిర్మోహమాటంగా తన కూతుర్ని కాన్పుకు ఆమె అత్తవారింటికే పంపేసింది. ఆ పని చేసిన తరవాత ఆమెకు ప్రాణభయం చాలా వరకు పోయింది.

కమల నెలరోజులూ పూజలు చేస్తూ, అత్తను కాలు కింద పెట్టనియ్యకుండా ఇంటిపని అంతా తానే చేసింది. కామాక్షమ్మ తన కోడలిని చూసి మురిసిపోయి, ఒకప్పుడు ఆమెను తాను రాచి రంపాన పెట్టిన సంగతి కూడా మరిచిపోయింది.

జ్యోతిష్కుడు చెప్పిన నెలపూర్తయింది. చివరి రోజున కామాక్షమ్మ ప్రాణాలు అరచేత పట్టుకుని మంచం ఎక్కి కూర్చుని, కాలు కింద పెట్టలేదు. గండం తప్పిపోయిందని కోడలు ఎంత ధైర్యం చెప్పినా ఆమెకు ఆ రోజు గడిచినదాకా భయం తీరలేదు.

తరవాత కామాక్షమ్మ కమలను కూతురికన్న ఎక్కువగా చూడసాగింది. తన అన్న పంపిన 'జ్యోతిష్కుడి' ధర్మమా అంటూ కమల సమస్య గట్టెక్కింది. రెండు గండాల నాటకంలో తన అన్న పాత్ర గురించి కమల తన భర్తకు కూడా చెప్పలేదు.



# సగం-సగం

ఒక యాత్రికుడు ఒక ఏకాదశినాడు ఒక గ్రామం వచ్చి, అక్కడ జమీందారుగారి మామిడితోట చూశాడు. మామిడిపళ్ళు కోతకు సిద్ధంగా ఉన్నాయి. ఏకాదశి ఉపవాసం గనక, ఫలహారానికి ఆ మామిడిపళ్ళు బాగుంటాయనుకుని యాత్రికుడు జమీందారు వద్దకు వెళ్ళి, పళ్ళు కావాలని అడిగాడు.

అతను కోరినన్ని పళ్ళు కోనుకునేటందుకు అనుమతి ఇస్తూ జమీందారు చీటీ ఇచ్చాడు. అది చూసి తోటకు కాపలా కాసేవాడు, "నువు కోనుకున్న పళ్ళలో నాకు సగం ఇయ్యాలి," అన్నాడు.

"అలాగే ఇస్తాను గాని, నే నిచ్చిన పళ్ళలో ఒకటి నాకు తిరిగి ఇయ్యాలి," అన్నాడు యాత్రికుడు.

కాపలావాడు సరేనన్నాడు. యాత్రికుడు తోటమాలితో కూడా ఇలాటి ఒప్పందమే చేసుకున్నాడు. అయితే అతను రెండే రెండు పళ్ళు కోనుకున్నందున తోటమాలికిగాని, కాపలా వాడికి గాని ఏమీ దక్కలేదు. వాళ్ళిద్దరికీ యాత్రికుడు ఒక్కొక్క పండు ఇచ్చి, తిరిగి పుచ్చుకుని, రెండు పళ్ళూ తానే ఆరగించాడు.






కృష్ణకాంతుడు పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. ఆ ఊళ్లో వాళ్ళ బంధువు లున్నారుగాని, వెళితే అతిగా అతిథి మర్యాదలు చేస్తారు; అందుకని ఉండే రెండు రోజులూ పూటకూళ్ళ ఇంట్లో ఉండమని తండ్రి సలహా యిచ్చాడు. మర్యాదలు చేయించుకుంటే తప్పేమని, కృష్ణకాంతుడు బంధువుల ఇంటికే వెళ్ళాడు.

శీతాకాలం కావడంచేత అతని కాళ్లు పగిలిఉన్నాయి. దానికితోడు నడకలో అతని కాలు మడతపడి బెణికింది. అతను బంధువుల యిల్లు చేరి తలుపు తట్టగానే ఇంటి యజమాని తలుపు తీసి, కృష్ణకాంతుణ్ణి చూసి కుశల ప్రశ్నలు వేసి, కృష్ణకాంతుడు వచ్చాడని గట్టిగా అరిచి భార్యకు చెప్పాడు.

కృష్ణకాంతుడు లోపలికి అడుగుపెట్ట బోతే ఆయన వారించి, "ఒసేవ్, మన చంటాన్ని పిలు!" అని అరిచాడు. కృష్ణకాంతుడికి బయట నిలబడడం ఇబ్బందిగా ఉంది; లోపలికి వెళ్ళి కూర్చోవాలని ఉంది. కాని ఆయన గుమ్మానికి అడ్డంనిలబడి, అవీ ఇవీ మాట్లాడుతున్నాడు. ఇంతలో ఆయన తనను లోపలికి రానివ్వడనుకుని, కృష్ణ కాంతుడు అరుగుమీద కూర్చోబోతే, ఆయన దానికి కూడా అడ్డుపడి, "ఒక్క నిముషం ఆగు, నాయనా. చంటాడు వచ్చేస్తాడు. అంతవరకూ కూర్చోవద్దు," అన్నాడు.

చంటాడు రావటానికి చాలాసేపు పట్టింది. వాడు ఎక్కడికో ఆడుకో బోయాట్ట! వాడు వచ్చి, చెంబులో నీళ్లు తెచ్చాడు. అసలు విషయం ఇంటాయన కృష్ణకాంతుడికి ఇలా బోధపరిచాడు :

"వసుంధర"

''అతిథి దేవుడితో సమానం. అంచేత అతిథిని దేవుడిలా గౌరవించడం మా ఇంటి సంప్రదాయం. అతిథికి ఇంట్లో ఎవరో ఒకరు కాళ్లు కడగాలి. నువేమో వయసులో చిన్నవాడివి. కన్యాదాన సమయంలో తప్ప పెద్దవాళ్లు చిన్న వాళ్లకు కాళ్లు కడగరాదు. అలా చేస్తే ఆయుక్షీణం! వయసొచ్చిన ఆడపిల్లలు పరాయిమగవాళ్ళ కాళ్లు కడగకూడదు. అందుచేత చిన్నవాడికోసం ఆగవలిసి వచ్చింది. వాణ్ణి వెతకడంలో ఆలస్య మయింది. కాళ్లు కడగకుండా అతిథిని కూర్చోబెట్టకూడదు. మరోలా అనుకోకు నాయనా.''

''అలాగే కానీ, నా అరికాళ్లు పగిలి ఉన్నాయండీ, చన్నీరు తగిలితే మంటలు పుట్టుతాయి,'' అన్నాడు కృష్ణకాంతుడు.

''అలా అనకూడదు. తిరిగి తిరిగి వచ్చినవాళ్లు చన్నీళ్ళతోనే కాళ్లు కడుక్కోవాలి,'' అన్నాడు ఇంటాయన.

చంటాడు కృష్ణకాంతుడి కాళ్లు కడిగాడు. కాళ్లు భగ్గున మండాయి. అతను లోపలికి వెళ్ళి కూర్చున్నాడు. ఇంటాయన మంగలిని పిలిపించి, అతని కాళ్ళకు నూనె మర్దన చేయించాడు. కృష్ణకాంతుడికి చాలా హాయిగా ఉన్నది.

ఆ రాత్రి భోజనాలయాక పురాణం శాస్త్రులుగారికి కబురు వెళ్లింది. ఆయన వచ్చి, అర్ధరాత్రిదాకా పురాణం చదివి వినిపించి, వెళ్లిపోయాడు.





''అతిథితో కలిసి పురాణం వింటె ఎంతో పుణ్యంట. ఇలాటి సమయాల్లో తప్ప నీకూ, నాకూ పురాణకాలక్షేపం జరుగుతుందా?'' అన్నాడు ఇంటాయన.

కృష్ణకాంతుడికి పెందలాడే నిద్ర పోవడం అలవాటు. పురాణం చెబుతున్నప్పుడు అతను బలవంతాన మేలుకొని ఉన్నాడు. కాని వేళ దాటే సరికి అతని నిద్రకూడా పోయింది.

అతనికి మండువాలో పక్క ఏర్పాటు చేశారు. అతను మంచంమీద నడుము వాల్చినాక, చంటాడు దొడ్లో నుంచి సింహంలా ఉన్న కుక్కను తెచ్చి, అతని మంచానికి కట్టేశాడు.

''అదేమిటి ?'' అన్నాడు కృష్ణ కాంతుడు ఆశ్చర్యంతో.

''ఊళ్లో దొంగల భయం ఎక్కువగా ఉన్నది. దొంగలు ముఠాలుగా వచ్చిపడి ఒక్కొకసారి మనుషుల్ని చంపేసి కూడా పోతున్నారు. అందుకని కుక్కను పెంచుతున్నాం. ఇటీవల దొంగలభయం తగ్గిందనుకో. అయినా అతిథికి రక్షణ కలిగించడం మా విధి.'' అన్నాడు అక్కడే ఉన్న ఇంటాయన.

కృష్ణకాంతుడికి ఊరకుక్కలంటేనే చచ్చే భయం. ఇది జాతికుక్క కూడానూ, సింహంలా ఉంది! కొత్తమనిషి కావడంవల్ల అతన్ని మరీ మరీ పట్టి చూస్తున్నది. ఇక అతనికి నిద్రప్రాప్తి పూర్తిగాపోయింది.

తెల్లవారుఝామున కాస్త కునుకు పట్టుతూండగా, ఇంటాయన వచ్చి అతన్ని లేపేశాడు. అతిథి లేస్తేగాని ఇంటి పనులేవీ చెయ్యగూడదుట !

రాత్రంతా నిద్ర లేకపోవడమూ, ప్రయాణం బడలికా, గాలిమార్పు మూలాన కృష్ణకాంతుడికి జలుబుచేసి, తుమ్ములు పట్టుకున్నాయి.

ఇంటాయన తల్లి డెబ్భయి ఏళ్ళది, కృష్ణకాంతుడు తుమ్మినప్పుడల్లా తన వేళ్లు నీళ్ళలో ముంచి అతని నెత్తిన

విదిల్చి, "చిరంజీవ !" అనసాగింది. త్వరలోనే అతని తల పూర్తిగా తడిసి పోయింది.

అతని తుమ్ములు ఆగాక, "ఎలా ఉంది, నాయనా ?" అన్నదావిడ.

"తల తుడుచుకునేటందుకు గుడ్డ కావాలండీ." అన్నాడు కృష్ణకాంతుడు.

"తప్పు, నాయనా! చిరంజీవ జలాన్ని తుడుచుకోకూడదు, దానంతట అదే ఆరిపోవాలి. ఇంట్లో వాళ్ళకు అస్త మానమూ ఇలా చెయ్యటం కుదరదు. కాని అతిథివి కాబట్టి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి." అని ఆమె వెళ్ళిపోయింది.

ఇలా నాలుగురోజులు గడిపాడు కృష్ణకాంతుడు. పురాణంవల్లా, కుక్క భయంవల్లా అతనికి నిద్ర బొత్తిగా లేకుండా పోయింది.

అతను వెళ్ళిపోయే రోజున అతని కోసం ప్రత్యేకంగా ఒక వీడ్కోలు పానీయం తయారుచేశారు. ఇంటాయన దాన్ని చిన్న గ్లాసులో కృష్ణకాంతుడికి ఇస్తూ, "అమృతంలాంటి ఈ పానీయం కేవలమూ అతిథుల కోసమే తయారు చేస్తాం. ఏడు గ్లాసులు అవుతుంది. అంతా నువే తాగాలి. ఇంటివాళ్లెవరూ తాగకూడదు. ఇది మా సంప్రదాయం," అన్నాడు.

కృష్ణకాంతుడు ఆశ్చర్యంగా, "అతిథులను గురించి ఇంత శ్రద్ధ తీసుకునేవాళ్ళు అరుదు. నా గురించి మీకు చాలా శ్రమా, ఖర్చూ అయాయి," అన్నాడు.

"దానిదేముంది, బాబూ? కాని ఎందు



వల్లనే మా ఇంటికి ఒకసారి వచ్చినవాళ్లు మళ్లీ రావడం లేదు. ఈ మధ్య ఒక్కరూ రాలేదు,'' అన్నాడు ఇంటాయన.

ఈ మాట విని కృష్ణకాంతుడు ఆశ్చర్యపడ్డాడు. వీళ్లు అతి మర్యాద చేసినా, ఆప్యాయతకు లోపం లేదు. అంతమాత్రానికే అతిథులు భయ పడాలా, అనుకుంటూ కృష్ణకాంతుడు వీడో(క్రా)లు పానీయం రుచి చూశాడు.

అతను ఇంటాయన కేసి తిరిగి, ''ఒకసారి మీ ఇంటికి వచ్చిన అతిథి మళ్లీ ఎందుకు రాడో నాకు అర్థమయింది. మీరు అతిథిని మరీ దేవుడిలా చూస్తు న్నారు. దేవుడు రాయి కాబట్టి ఎంతైనా భరిస్తాడు, మానవమాత్రుడి కది సాధ్యం కాదు. పానీయాన్ని నన్ను ఒక్కణ్ణీ తాగమనడం అన్యాయం. మీ ఇంటిలో అందరు నాతోబాటు తాగవలిసిందే,'' అన్నాడు.

ఎవరూ అందుకు ఒప్పుకోలేదు. కాని, ''అతిథి ఆఖరు కోరిక మీరు మన్నించి తీరాలి,'' అని కృష్ణకాంతు డన్నమీదట, అందరూ తలాకాస్త పానీయం పుచ్చు కున్నారు.

దాన్ని రుచి చూస్తూనే ఇంటాయన, ''ముందా పానీయాన్ని అవతల పార బొయ్యండి!'' అన్నాడు కోపంగా. దాని రుచి మహా భయంకరంగా ఉన్నది.

''ఒకటి కాదు, రెండు కాదు, ఏడు గ్లాసులు ఈ పానీయాన్ని తాగినవాడు మళ్లీ మీ ఇంటికి ఎలా వస్తాడు?'' అన్నాడు కృష్ణకాంతుడు.

ఇంటాయన సిగ్గుతో తలవంచు కున్నాడు. తన భార్యకు అతిథులంటే ఇష్టంలేక ఈ పానీయం తయారుచేస్తున్న దని ఆయన గ్రహించాడు.

''అతిథిని ప్రత్యేకంగా చూడక, మీ ఇంట్లో మనిషిలా చూసుకుంటే ఏ ఇబ్బందీ ఉండదు. మీ ఆతిథ్యానికి నేను చాలా కృతజ్ఞుణ్ణి,'' అంటూ కృష్ణకాంతుడు సెలవుపుచ్చుకుని, తన ఊరు వెళ్లిపోయాడు.



# దొంగబుద్ధి

రంగడు అనేవాడు పేరయ్యశెట్టి దుకాణం దగ్గరకు వెళ్ళి, తనకు ఏదైనా పని చూపించమన్నాడు.

"నిన్ను నా దుకాణంలోనే పెట్టుకుంటాను. నేను చెప్పిన పని ఎల్లా చేయవలసి ఉంటుంది," అన్నాడు పేరయ్య.

సరేనన్నాడు రంగడు.

"అప్పుడప్పుడు పక్క దుకాణం షావుకారు పొరుగూరు వెళుతూంటాడు. ఆ సమయంలో నువు ఆ దుకాణంలో పని చెయ్యాలి. అయితే ఆ షావుకారుకు అనుమానం రాకుండా కొంత అమ్మకం సొమ్ము నాకు ఇస్తూండాలి. దొరికిపోయినట్టయితే, ఆ నేరం నీ మీదే వేసుకోవాలి. సరేనా?" అని పేరయ్య అడిగాడు.

సరేనన్నాడు రంగడు.

శెట్టి, "తక్షణం గుమ్మం దిగు!" అన్నాడు.

"ఏం?" అన్నాడు రంగడు తెల్లబోతూ.

"నీది దొంగబుద్ధి. ఇలాటివాడివి నేను లేని పక్షంలో నమ్మకంగా పనిచేస్తావని ఏమిటి?" అన్నాడు పేరయ్య.

—ఆరుపల్లి గోవిందరాజులు.





# దయ్యాల బంగళా

జమీందారు రాఘవరావుకు గ్రామం పొలిమేరలో ఖాళీస్థలం ఉండేది. ఆ స్థలాన్ని రాము అనే వయసుమీరిన పెద్ద మనిషి బాడుగకు తీసుకుని, నెలకు ఇంత చెల్లిస్తాననీ, ఒక సంవత్సరంపాటు బాడుగ చెల్లించలేకపోతే స్థలాన్ని వదులుకుంటాననీ రాఘవరావుతో ఒప్పందం చేసుకున్నాడు.

రాము ఒంటరిగాడు, ఎవరితోనూ కలిసేవాడు కాడు. అతను ఖాళీస్థలంలో ఒక బంగళా, వెదురుగోడలతోనూ, పెంకులకప్పుతోనూ కట్టించి, అందులో నివసించసాగాడు. అది చాలా అందమైన బంగళా. దానిచుట్టూ చక్కని క్రోటన్ మొక్కలూ, పళ్ల చెట్లూ ఉండేవి. పైనుంచి అది ఎంతో ఆకర్షవంతంగా కనబడినా, దాని లోపలికిపోయి చూసే అవకాశం ఎవరికీ ఉండేది కాదు.

రాము తన వంట తానే చేసుకుని, ఒంటరిగా జీవించేవాడు, నెల పూర్తి కాక మునుపే జమీందారు వద్దకు వెళ్లి, అద్దె చెల్లించేసేవాడు. ఇలా రెండేళ్లు గడిచాయి. గ్రామస్థులకు క్రమంగా అతన్ని గురించి ఆసక్తి తగ్గింది. అతను ఒంటరిగా ఉండటం లేదనీ, అతనికి ఆ బంగళాలో దయ్యాలు తోడు ఉంటున్నాయనీ కూడా జనం అనుకునేవారు.

ఇలా ఉండగా ఒక నెలాఖరున రాము జమీందారు వద్దకు వచ్చి బాడుగ ఇయ్యలేదు. మరోవారం గడిచింది. రాము జాడ లేదు. ఏమి జరిగినదీ చూసి రమ్మని జమీందారు మనుషులను పంపాడు. ఇద్దరు మనుషులు వచ్చి రామును పిలిచారు. జవాబులేదు. తలుపు గడియ పెట్టి లేదు. వాళ్లు లోపలికి వెళ్లి చూశారు. ఎక్కడి వస్తువులు అక్కడే ఉన్నాయి

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

గాని, రాము లేడు. రోజల్లా వాళ్లు అక్కడే కాపలా కాశారు. రాము రాలేదు. ఆ సాయంకాలం వాళ్లు బంగళాకు తాళం పెట్టి, జమీందారు దగ్గరకుపోయి సంగతి చెప్పారు.

రోజులూ, నెలలూ గడిచాయి. ఏడాది గడిచింది. రాము పూర్తిగా అదృశ్యుడయాడు. జమీందారు బంగళాను స్వాధీనం చేసుకుని, యువసమాజ కార్యాలయంగా ఉపయోగించుకోవటానికి ఊరి యువకులకు ఇద్దామనుకున్నాడు. కాని, అది దయ్యాలకొంప అనీ, దయ్యాలు రామును ఏ కారణంచేతనో అపహరించాయనీ అందరూ అనుకున్నారు. అందులోకి ఎవరూ అడుగు పెట్ట సాహసించలేదు. ఆ బంగళాలో చీకటిపడినాక దయ్యాలు కనిపించాయన్న పుకార్లు కూడా గ్రామంలో బయలుదేరాయి.

అసలు జరిగినదేమంటే:

రాము అసలుపేరు కాలిపదుడు. అతనికి మరో జిల్లాలోని బందిపోటు దొంగలతో సంబంధం ఉన్నది. ఆ దొంగల ముఠావాళ్లు ఒకరాత్రి ఎవరో జమీందారు ఇల్లు దోచి, దాన్ని తమ స్థావరంలో భద్రంగా దాచమని రాముకు ఇచ్చారు. రాము ఆ డబ్బూ, నగలూ



తీసుకుని పారిపోయి, పేరు మార్చుకుని, మరో ప్రాంతంలో మకాం పెట్టి, ఎవరితోనూ సంబంధం లేకుండా, ఒంటరిగా జీవించసాగాడు. అతను తన డబ్బునూ, నగలనూ ఒక పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను తన తలగడ కింద పెట్టుకునేవాడు.

దొంగలు చూస్తూ కూచోలేదు. వాళ్ల నాయకుడు కాలిపదుడి జాడ తెలుసుకుని, తన అనుచరుల సహాయంతో అతన్నీ, డబ్బుగల పెట్టెనూ, తమ రహస్య స్థావరానికి తీసుకుపోయాడు.

తరవాత దొంగలు కాలిపదుణ్ణి కాళికాదేవికి బలి ఇద్దామనుకుంటూండగా, వాళ్ల స్థావరంమీద పోలీసులు హఠాత్తుగా



దాడి జరిపి, దొంగలందరినీ చుట్టుముట్టి పట్టుకున్నారు.

ఆ గ్రామంలో మానస్ అనే కాలేజి విద్యార్థి ఉండేవాడు. అతను శలవులకు ఇంటికి వచ్చి, జమీందారు బంగళాను యువకుల కిస్తానన్నాడనీ, యువకులు నిరాకరించారనీ విన్నాడు. శాస్త్రవిజ్ఞానం గల మానసుడికి దయ్యాల లాంటి వాటిలో నమ్మకం లేదు. అయితే మూఢ నమ్మకాలు గల యువకులూ, గ్రామస్థులూ తన నమ్మకాలను ఖాతరు చెయ్యరని అతనికి తెలుసును. వాదించిన కొద్దీ పరిస్థితి మరింత విషమిస్తుంది.

అతను సురజిత్ అనే యువక నాయకుణ్ణి కలుసుకుని, "జమీందారుగారు మనపట్ల ఎంతో దయతో బంగళా ఇస్తున్నారు, కాని దయ్యాల బెడద పోవాలి," అన్నాడు.

"దయ్యాలుపోతే బంగళాను చక్కగా ఉపయోగించుకోవచ్చు," అన్నాడు సురజిత్.

"మన ఊళ్లో మంచి భూతవైద్యులు లేరా?" అని మానస్ అడిగాడు

"అందరూ చేతగాని చవటలే," అన్నాడు సురజిత్.

"కొంచెం వ్యవధి ఇస్తే దయ్యాలను వదిలించే మార్గం నేను చూడగలను," అన్నాడు మానస్.

రెండు రోజుల అనంతరం అతను పట్నంనుంచి సత్యానందుడు అనే భూత వైద్యుణ్ణి తెచ్చాడు. ఆ భూతవైద్యుడు జుట్టు విరబోసుకుని, ఎర్రని బట్టలు ధరించి ఉన్నాడు. మానస్ అతన్ని తన స్నేహితులకు గొప్ప భూతవైద్యుడుగా పరిచయం చేశాడు.

మర్నాడు శనివారం. బంగళా దయ్యాలను ఉద్వాసన చెయ్యటానికి ఆ సాయంకాలం బంగళాలోనే ప్రయత్నాలు ప్రారంభమయాయి. అంతటా పూలుచల్లి, గుగ్గిలం దూపం వేశారు. అక్కడ చేరిన

గ్రామస్థులతో భూత వైద్యుడు ఇలా అన్నాడు:

"మహాశయులారా, ఇక్కడ ఉన్నది బ్రాహ్మణ దయ్యం మాత్రమేనని నాకు స్ఫురిస్తున్నది. నేను అతన్ని తృప్తిపరచి, బంగళా వదిలిపోవటానికి ఒప్పించాను. అతన్ని ఈ సీసాలోకి పంపిస్తున్నాను. అతన్ని సీసాలో నిద్రపుచ్చి, సీసాను నీటిలో పడవేశానంటే, లోకాంతరంలో అతను శాశ్వతశాంతి అనుభవిస్తాడు. మీరు అనుమతిస్తే అలాచేస్తాను. ఏమంటారు?"

"అలాగే చెయ్యండి'!" అని అందరూ అన్నారు. సత్యానందుడి అవతారమూ, మాటతీరూ చూసి అందరికీ అతనిలో గురికుదిరింది:

సత్యానందుడి ముందు నేల మీద వెడల్పు మూతిగల సీసా ఒకటి నిలబెట్టి ఉన్నది. దాని పక్కన అరటిపండు ఒకటి ఉన్నది. దాని లావు సీసామూతి కన్న ఒక్క పిసరు హెచ్చుగా ఉన్నది. ఏవో వింత అక్షరాలు రాసిఉన్న పెద్ద కాగితం ఒకటి తీసుకుని, దానిమీద రాసి ఉన్న మంత్రాలు చదివి, కాగితాన్ని సీసాలో వేసి, దానిమీద కొంచెం నూనె చిలకరించి, దాన్ని అంటించాడు సత్యానందుడు. సీసాలో కాగితం మండు తూండగా, అతను అరటిపండు తీసుకుని, దాని దిగువభాగంలో కొంచెం తొక్క ఒలిచి, సీసామూతిలోకి గుచ్చాడు. అరటిపండు సీసామూతిలో నిలబడటమే



కాక, సత్యానందుడు మంత్రాలు చదువుతూంటె కొంచెం కొంచెంగా సీసాలోకి దిగిపోసాగింది. అందరికీ దిగ్భ్రాంతి కలిగేలాగ సీసా అరటిపండును మింగేస్తున్నది! లోపల అదృశ్యంగా ఉన్న దయ్యం దాన్ని ఇష్టంగా స్వీకరిస్తూ ఉండాలి. త్వరలోనే ఫండు సీసాలోకి వెళ్ళిపోయి, దాని తొక్క బయట పడిపోయింది.

సత్యానందుడు సీసామూతికి బిరడా బిగించి, ''దయ్యం ఇప్పుడు నా అధీనంలో ఉన్నది. బంగళాకు ఇక దాని బెడద లేదు ; మీరు దాన్ని స్వేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు,'' అంటూ లేచి నిలబడి, అందరితోబాటు బంగళాలోకి దారితీశాడు.

ఆ సాయంకాలమే ఆ బంగళాలో యువసమాజానికి ప్రారంభోత్సవం జరిగింది. దానికి జమీందారుగారే అధ్యక్షత వహించారు.

మానస్ సత్యానందుడి వెంట మర్నాడు ఉదయం పట్టణానికి బయలుదేరాడు.

''బాబూ, ఈ దయ్యం ప్రక్రియ ఏమిటి ? అరటిపండు సీసాలోకి దిగిపోతుంటే నేనూ ఆశ్చర్యపడ్డాను. సీసాలో ఆ కాస్త వేడికే, గాలి ఒత్తిడి ఫలితంగా పండు లోపలికి పోయిందా ?'' అని మానస్ సత్యానందుణ్ణి అడిగాడు. సత్యానందుడు నిజానికి మానస్ సహాధ్యాయి ఒకడికి బాబాయి అవుతాడు. అతను ధరించిన జుట్టూ బట్టలూ అరువు తెచ్చుకున్నవి.

సత్యానందుడు నవ్వి, ''అవును, నాయనా. సీసాలో మంట పెట్టినప్పుడు అందులోని గాలి అమితంగా వ్యాకోచించుతుంది. ఆ క్షణంలో అరటిపండును సీసామూతికి అడ్డంపెడితే, లోపలిగాలి చల్లబడి సంకోచంపొందినకొద్దీ, బయటి గాలి ఒత్తిడికి అరటిపండు సీసాలోపలికి దిగిపోతుంది,'' అన్నాడు.





# వీరహనుమాన్

హనుమంతుడు అయోధ్యను చేరే దారిలో ఉన్న వాల్మీకి ఆశ్రమంలో దిగి, వాల్మీకి మహామునికి నమస్కరించి, "మహానుభావా! ఎందుకిలా జరిగింది? అని అడిగాడు.

వాల్మీకి చిరునవ్వు నవ్వి, "హనుమంతా! రాజ్యపాలన ఎంత కఠోరమైనదో, శంబుకుడిలాంటి పరమసాధువైన నిరపరాధులు అధికవర్గాల వారి ప్రాబల్యం వల్ల ఎలా బలి అవుతూంటారో అనేకాక, కానిపని అని తెలిసి కూడా పాలకుడు పాపం మూటగట్టుకోవలసి ఉంటుందనీ, మాయావులయిన పాపిష్ఠి నోళ్ళనుండి వెలువడిన విషబీజాలు పామర ప్రజల్లో చెలరేగకుండా ఎలాంటి త్యాగాలు చేయవలసి ఉంటుందో నిరూపణ కావడానికే, ఇలా జరిగిందనీ నీకు తెలుసు; నేను వేరే చెప్పాలా?" అని అన్నాడు.

హనుమంతుడు వాల్మీకి ఆశ్రమంలో సీత ఉండిన కుటీరాన్నీ, లవకుశులు చెట్లబోదెలపై బాణాలతో పెట్టిన గుర్తుల్నీ తనివితీరా చూచాడు. సీత సంచరించిన నేలను కళ్ళకద్దుకొని అయోధ్యకు ఎగిరాడు.

హనుమంతుడు ఎగురుతూ అయోధ్యను చేరి రాజభవనం ముందు ఉద్యానవనంలో వాలాడు.

అక్కడ కుశలవులు విలువిద్యలో వినోదిస్తున్నారు. వాళ్ళిద్దరిమధ్యా బాణాలతో ఒంటిస్తంభం మేడ ఎత్తుగాలేచి

## 43. శత్రుశేష నిర్మూలన



ఉంది. లవకుశులు హనుమంతుడిని చూసి, కనుసైగలు చేసుకొని ఇద్దరూ హనుమంతుడి చుట్టూరా బాణాలుకొట్టి కంచెనాటారు.

"మాయావీ! ఎవరు నువ్వు?" అని గద్దించాడు లవుడు.

లవుడిలో సీత పోలికలు ఎక్కువగా ఉన్నవి. కుశుడు రాముడినిపోలిఉన్నాడు. సీతారాముల లాగ కనిపిస్తున్న లవకుశులను హనుమంతుడు కళ్ళవిందుగా చూస్తూ, "నేను హనుమంతుడిని! రాముడిని కలుసుకోవాలి!" అన్నాడు.

"నిన్ను నమ్మేదిలేదు, గదాగిదాపట్టుకొని హనుమంతుడి వేషం వేసుకు వచ్చిన మాయలమారివి. మారీచుడికేమౌతావు?" అంటూ లవుడు బాణం ఎక్కుపెట్టాడు.

లవుణ్ణి శాంతపరుస్తూ, రాముడిలాగ శాంతంగా కుశుడు, "నువ్వు హనుమంతుడివేనని నిరూపించుకొంటేనేగాని నిన్ను కదలనివ్వము!" అన్నాడు.

"నీ ప్రతాపాలన్నీ చూపించు! మొదట నీ ప్రబల రూపం చూపించు!" అన్నాడు లవుడు.

హనుమంతుడు పెరిగి వారినిద్దరినీ ఆలింగనం చేసుకున్నాడు. వారిని తన వీపు మీద కూర్చుండబెట్టుకొని ఆకాశానికెగిరి సరయూనది మీదుగా అయోధ్యానగరం చుట్టూరా గిరగిరా తిప్పాడు. ఆకాశం ఎత్తున పెరిగి సీతకు చూపిన విశ్వరూపాన్ని చూపించాడు. తోకను పెంచి గిరగిరా తిప్పి, చుట్టచుట్టి కోట కట్టాడు. లవకుశులను భుజాలమీద ఎక్కించుకొని, "మైరావణ సంహారంలో రామలక్ష్మణులను ఇలాగే మోశాను." అంటూ కోట గోడలమీద చుట్టూరా తిప్పి వచ్చాడు.

లవకుశులు హనుమంతుడికి నమస్కరించి, "హనుమంతుడా! నీ ప్రతాపాల్ని కళ్ళారా చూడాలని నిన్ను ఆటాడించాము, మమ్మల్ని మన్నించు!" అని ముసిముసినవ్వుతూ క్షమాపణ చెప్పుకున్నారు.

"మీ కోరిక తీర్చడానికే నేనూ మిమ్మల్ని అడించాను మరి!" అన్నాడు హనుమంతుడు నవ్వుతూ. లవకుశులు చెరోపక్కా హనుమంతుడి చేతులు పట్టుకొని రాముడి దగ్గరకు నడిపించారు.



రాముడు హనుమంతుడిని చూస్తూనే దుఃఖాతిశయం వల్ల మాటాడక కన్నీరు పెట్టుకున్నాడు. హనుమంతుడు రాముడి ముందు మోకరిల్లి "నువ్వూ, పామరుడి లాగ దుఃఖానికి వశమైతే ఎలాగ? రాజ్య పాలన సుఖభోగాల పూలశయ్య కాదనీ, ఎలాంటి పనినైనా చేయవలసి ఉంటుం దనీ, ఎంతటి త్యాగాన్నైనా చేయక తప్పదనీ మున్ముందు కాలాల్లో కూడా రామరాజ్యాన్ని ఉదాహరణగా చెప్పు కోవడం కోసమే ఇలా జరిగింది కదా! నువ్వేది చేసినా అందులో ఏదో పరమార్థం ఉంటుంది, అర్థం చేసుకోగల వాళ్ళకే అది అర్థమౌతుంది!" అని ఊరడించాడు.

అప్పుడు రాముడు, "హనుమా! నిన్ను చూసి, నీ మాటలు విని నా మనస్సు కొంత తేరుకుంటున్నది; సీతలేని బెంగకు తోడు ఈ అశ్వమేధ యాగం విఫలమైతే నీ రాముడు నీకు దక్కడు! యాగాశ్వం ఇప్పుడు మణిపురం దిశగా వెళ్తూన్నట్లు తెలిసింది. అశ్వరక్షణ భారం నీ భుజ స్కంధాల మీద కూడా మోపుతున్నాను. అందుకే నిన్ను పిలిపించాను. అశ్వం వెంట నా ముగ్గురు తమ్ముళ్ళూ వెళ్తు న్నారు, నీవు వాళ్ళతో చేరు!" అని చెప్పాడు.

రాముడి ఆజ్ఞను శిరసావహించి హను మంతుడు గదను భుజాన వేసుకొని రివ్వున ఆకాశానికి ఎగిరాడు.

హనుమంతుడు ఆకాశమార్గాన పోతూండగా, ఒక కీకారణ్యంలో ఒక రాక్షసి, ఒక రాక్షసుడు విజయనాదాలు చేస్తూ తాగి తందనాలాడుతూ కనిపించారు. అనుమానం వేసి హనుమంతుడు సూక్ష్మ రూపంతో వాళ్ళకు సమీపంలో ఒక చెట్టు మీద వాలి పొంచి ఉన్నాడు. వాళ్ళు



నృత్యం చాలించి చెట్టు కిందకు చేరి మాట్లాడుకుంటున్నారు. హనుమంతుడు వింటున్నాడు:

"శత్రుశేషం ఉండరాదని ఊరికే అన్నారా? శత్రుశేషంగా మిగిలిన మనం మన అన్నల రుణం తీర్చుకున్నాం, కరాళకంఠుడా! ఆ రాత్రి చాకలివాడిగా నీ కరాళకంఠ స్వరంతో ఎంత బాగా అరిచావు. ఓండ్రపెట్టావు!" అని రాక్షసి అన్నది.

"శూర్పణఖా! నీ వగల ఏడుపెంత బాగుందనుకున్నావు. దొంగవేషం చాకలిదానా!" అని రాక్షసుడు బదులు మెచ్చుకున్నాడు.

కరాళకంఠుడు శతకంఠ రావణుడి తమ్ముడు. యుద్ధంలో చావు తప్పించుకొని పారిపోయి తన అన్న శతకంఠ రావణుడిని చంపిన సీత మీదా, రాముడి మీదా పగ సాధించడానికి చాకలివాడి రూపంతో అయోధ్య చేరాడు. రావణాసురుడి చెల్లెలు శూర్పణఖ బ్రతికే ఉంది. కాకతాళీయంగా అది కూడా పగ సాధించడానికే చాకలిదాని రూపంతో అయోధ్య చేరింది. వాళ్ళిద్దరూ చాలా చిత్రంగా కలుసుకున్నారు.

ఇద్దరూ ఆకలితో మనిషి దొరికితే తిందామని ఊరు పొలిమేరల్లో తిరుగుతూ ఒకరికొకరు చాకలి రూపాల్లోనే తారసపడ్డారు. శూర్పణఖ వయ్యారాలొలికిస్తూ క్రీగంటి చూపుతో కరాళుడిని లాక్కెళ్లింది. అడమాంసమైనా, ఏదో ఒకటి తినక తప్పదుగదా అని ఆకలిగొన్న కరాళుడు ఆమె వెంటపడ్డాడు. మనిషి దొరికాడు తిందామని శూర్పణఖ రాక్షసాకారం తాల్చి నోరావులించేసరికి, "నువ్వూ రాక్షసివేనా?" అంటూ కరాళుడూ రాక్షసుడై నిలిచాడు. వాళ్లిద్దరూ చాకలి దంపతులుగా కపట నాటకం ఆడి, అయోధ్య నుంచి పారిపోయి అరణ్యాల్లో ఉంటున్నారు.

చెట్టుమీద ఉన్న హనుమంతుడు వాళ్ల మాటలు వింటున్నాడు:

"అప్పుడు హనుమంతుడు లేక పోయాడు కాబట్టి సరిపోయింది గాని, అయోధ్యలోనే ఉంటే మనల్ని పసిగట్టి మన అన్నల దగ్గిరికి పంపేవాడు. మన అదృష్టం బాగుండబట్టే ఏదో పర్వతం మీద ఉండిపోయాడు ఆ వానరుడు!" అన్నాడు కరాళుడు.

"ఆ హనుమంతుడి* ఊసెత్తకు, వాడంటే నాకు కోపం!" అన్నది శూర్పణఖ.

"కోపం కాదు, గుండె దడ అను!" అన్నాడు రాక్షసుడు పళ్ళికిలిస్తూ.

"మా అన్న బంగారంతో నాకు కట్టిచ్చిన మేడ కాల్చిపారేశాడుగద, తోకగాడు! వాడంటే నాకు భయం గియం లేదుగాని మా చెడ్డ ఒళ్లుమంట!" అంటూ శూర్పణఖ వీపు తడుముకొంది. దాని వీపు మీద పెద్ద కాలిన మచ్చ ఉంది. అది లంకాదహనమప్పుడు మండుతున్న దూలం దాని వీపున పడినందున ఏర్పడిన మచ్చ. కరాళుడు దాన్ని చూసి హేళనగా, "అందుకా మంట అంటున్నావు! ఇంకా చురచురలాడుతోంది కాబోలు పాపం! మేడ కాలిపోయినా మచ్చ ఉంది పోన్లే!" అన్నాడు.

వాడి వేళాకోళానికి శూర్పణఖ ముఖం ముడుచుకొని, "చాల్లే, మహా చెప్పొచ్చావు!" అంది.



"అది కాదే శూర్పణీ! నాకూ వాడంటే మంటే, మంటన్నరాను! మా చెడ్డవాడు సుమీ!" అన్నాడు వాడు.

"అలాగ చెప్పు! మహావీరుడిలాగ మాటాడకు! వాడి బారినుండి పారిపోయావు, పిరికివెధవా! యుద్ధంలో చచ్చావు కాదు వీరుడిలాగ!" అంది శూర్పణఖ కోపంగా.

"పారిపోబట్టే కదా పగ తీర్చుకున్నాను; నీలాంటి అందాల రాక్షసి నాకు దొరికింది!" అన్నాడు వాడు.

"ఇహ మనం ఏ దూర తీరాలకో పోయి జీవితాలు సార్థకం చేసుకుందాం పద!" అంది శూర్పణఖ.



''మరొక్కపని చేసి మరీ పోదాం. రాముడి యాగాశ్వాన్ని మనం పట్టుకోవాలి!'' అన్నాడు కరాళుడు.

''భలే! దానిమీద సవారీ చేస్తూ పోదాం!'' అంది శూర్పణఖ.

''సవారీకి కాదే వెర్రిమొగమా!'' అన్నాడు వాడు.

''ఆఁ! ఏమని కూశావు? మళ్ళీ అలాగన్నావంటే జాగరత! నా గోళ్ళ పదును చూపిస్తా! ముక్కూ చెవులూ కొంచెం మొద్దుబారాయి కాని, నా మొగానికేం? లక్ష్మణుడు కోసెయ్యక మునుపు మూరెడు ముక్కూ, బారెడు చెవులూ ఉండేవి. ఇప్పుడే నా ముఖం అందంగా ఉందనుకో! అన్నట్టు, కామగమనం గల మనకు గుర్రం ఎందుకురా, కరాళా?'' అంది శూర్పణఖ.

''దాన్ని మనం చంపెయ్యాలి!'' అన్నాడు కరాళుడు.

''గుర్రం మీద మన కేం పగనీ?'' అంది శూర్పణఖ.

''గుర్రం మీద కాదే శూర్పణఖా, రాముడి మీద పగ! గుర్రం కనిపించక పోతే రాముడియాగం ధ్వంసం అవుతుంది. సీత లేక అరప్రాణంతో ఉన్న రాముడు ఠారుమంటాడు!'' అని విడమర్చాడు కరాళుడు.

''అయితే త్వరగా చంపేద్దాం పద! గుర్రం తలమాంసం మాంచిరుచిగా కూడ ఉంటుందిలే!'' అంది శూర్పణఖ.

''తిండిపోతూ! ఎంతసేపూ తిండి ధ్యాసే నీకు!'' అంటూ కరాళుడు లేచాడు.

హనుమంతుడు చెట్టు కొమ్మలు విరిచి వాళ్ళమీద వేశాడు.

''మనమీద పూలవాన కురిపిస్తున్నారా పెద్దలు!'' అంది శూర్పణఖ.

''పూలవర్షం కాదే కామరూపిణీ! చెట్టు ఆకులవర్షం!'' అన్నాడు కరాళుడు.

''ఏదో ఒకటి, పద వేగం గుర్రం పనిపడదాం!'' అంటూ శూర్పణఖ కరాళుడి చేతులుపట్టుకుని, ఇద్దరూ బయలుదేర బోతూండగా హనుమంతుడు

తన తోకను పెంచి వాళ్ళదారి కడ్డంగా పంపాడు.

"సర్పం! మహాసర్పం!" అన్నాడు, కరాళుడు.

శూర్పణఖ పరికించి, "పాముకాదు, తోక! యముడు విసిరిన ఉరిత్రాడు! హనుమంతుడి తోక," అంది కెవ్వున అరుస్తూ.

"ఊరుకోవే! ఇక్కడేం హనుమంతుడే? ఏది చూసినా నీకు హనుమంతుడి భయం!" అన్నాడు కరాళుడు.

"నాకు బాగాగుర్తు రా! లంకకాల్చిన ఆ తోక ఇదే!" అంది శూర్పణఖ గజగజలాడుతూ. శూర్పణఖ మాటలు వింటూనే కరాళుడు పారిపోబోతూంటే శూర్పణఖ, "నన్నొక్కదాన్నీ వదిలేసి పారిపోతావుట్రా?!" అంటూ వాణ్ణి పట్టుకుంది.

చెట్టు దిగి హనుమంతుడు భీకరాకారంతో నిల్చున్నాడు. రాక్షస జంట కీచుకీచుమంటూ పారిపోతూంటే హనుమంతుడు పెద్ద గండశిలాపర్వతాన్ని పెకల్చి, వాళ్ళమీదకు విసిరాడు. దాని కింద పడి వాళ్ళు చచ్చారు.

ఆ విధంగా శత్రుశేషనిర్మూలన తన చేతుల మీద జరిగినందుకు సంతోషించి హనుమంతుడు అడవి దద్దరిల్లేలా సింహనాదం చేసి రివ్వున ఆకాశాని కెగిరి మణిపురం దిశగా వెళ్ళాడు.

హనుమంతుడు ఆకాశంలో ఎగురుతూ, పాయలుగా చీలి, సుందరవనాల గుండా పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తున్న గంగానదిని దాటి, మణిపురరాజ్య పరిసరాల్ని చేరాడు. దూరంలో బ్రహ్మపుత్రానది వెండి కరిగి పారుతూన్నట్లు మిలమిల మెరుస్తూన్నది.

అంతలో మణిపుర రాజధాని పొలిమేరలో ఆకాశంలో ఒక మెరుపు మెరిసి, గొప్ప ధ్వనితో రివ్వున దూసుకునిపోతున్నట్లు కనిపించింది. హనుమంతుడు మెరుపును మించిన వేగంతో అటు ఎగురుతూ వెళ్లాడు.





# గంగావతరణం

అయోధ్యను ఒకప్పుడు పాలించిన నగరుడికి కేశినీ, సుమతీ అని ఇద్దరు భార్యలు. పిల్లలకోసం నగరుడు తన ఇద్దరు భార్యలతోసహా హిమాలయాలలో తపస్సు చేశాడు.



దాని ఫలితంగా కేశినికి అసమంజు డనే కొడుకు కలిగాడు. సుమతి ఒక పిండాన్ని ప్రసవించింది. అది బద్దలై, దానినుంచి వెయ్యిమంది కొడుకులు పుట్టారు.



నగరుడు అశ్వమేథయాగం చేసి, గుర్రాన్ని వదిలాడు. నగరుడి ఆధిక్యత పెరగటం చూసి ఓర్చలేక ఇంద్రుడు యాగాశ్వాన్ని కాజేసి, దాన్ని పాతాళంలో కపిలుడి ఆశ్రమంలో దాచాడు.



తన గుర్రం అదృశ్యమైనట్టు తెలిసి, సగరుడు దాన్ని వెతకటానికి తన వెయ్యిమంది కొడుకులనూ పంపాడు. వారు అన్నిదిక్కులా వెతికారుగాని, గుర్రం జాడ తెలియలేదు.



చివరకు వాళ్ళు భూమిని తవ్వి పాతాళం చేరి, అక్కడ గుర్రాన్ని చూశారు. వాళ్ళు గుర్రాన్ని తీసుకోవటానికి వస్తూండగా కపిలుడు తన వాడి చూపులతో వారిని భస్మం చేశాడు.



చాలా కాలం గడిచిపోయింది. తన కొడుకులు ఏమయారో కనుక్కు రమ్మని సగరుడు అసమంజుడి కొడుకైన అంశుమంతుణ్ణి పంపాడు. అంశుమంతుడు పాతాళానికి వెళ్ళి, కపిలుణ్ణి మెప్పించి, గుర్రాన్ని తెచ్చాడు. అయితే బూడిద కుప్పలైపోయిన సగరుడి కొడుకులను బతికించటం అతనివల్ల కాలేదు. అందుకుగాను దేవలోకం నుంచి గంగను భూలోకానికి దించవలసి ఉన్నది.

ఆ పని చెయ్యటానికి అంశుమంతుడి కొడుకు దిలీపుడు యత్నించాడు. కాని అతనికి అది సాధ్యంకాలేదు. దిలీపుడి కొడుకు భగీరథుడు దీర్ఘ కాలం తపస్సు చేసి, గంగను భూమికి తీసుకురావటానికి బ్రహ్మ నుంచి వరం పొందాడు.





కాని శక్తివంతమైన గంగాప్రవాహం భూమిపైన పడితే ప్రమాదం. దాని తాకిడికి తట్టుకోగలవాడు శివుడు మాత్రమే. భగీరథుడు శివుణ్ణి ప్రార్థించి, అతని సహకారం సంపాదించాడు.

హిమాలయ పర్వతాలలో శివుడు గంగను స్వీకరించటానికి నిలిచి ఉన్నాడు. గంగ అతని జటాజూటంలో వచ్చి పడింది. దాని ధాటి తగ్గినాక, అది నేలపైకి దిగింది.





భూమికి దిగిన గంగ ఉల్లాసంగా కొండలు దిగి పరిగెడుతూ, జహ్ను మహాముని ఆశ్రమంలోకి జొరబడి, అతడి అగ్నిహోత్రాన్ని ఆర్పింది.



జహ్ను మహాముని ఆగ్రహించి గంగా జలాన్ని పూర్తిగా తాగేశాడు. భగీరథుడు వచ్చి వేడుకున్న మీదట ఆయన తన చెవి నుంచి గంగను బయటికి వదిలాడు. ఆ విధంగా గంగకు జాహ్నవి అనే పేరు వచ్చింది.



చిట్టచివరకు, గంగ భగీరథుడి వెంట సముద్రాన్ని చేరి, పాతాళానికి దిగి, బూడిద కుప్పలుగా దీర్ఘకాలం పడి ఉన్న సగరుడి కొడుకుల మీదుగా ప్రవహించి, వారిని బతికించింది. భగీరథుడి ఆశయం నెరవేరింది.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

ఒక అసామీ చొక్కా గుడ్డ కొని, దర్జీ దగ్గిరికి తీసుకుపోయి, తనకు చొక్కా కుట్టమన్నాడు. దర్జీ గుడ్డను కొలిచి, "ఇది మీ చొక్కాకు చాలదు," అన్నాడు. అసామి ఇంకో దర్జీని విచారించి చూశాడు.

"గుడ్డ సరిపోతుంది. రెండు రోజులకు రండి, చొక్కా కుట్టి ఉంచుతాను," అన్నాడు రెండో దర్జీ.

రెండు రోజుల తరవాత అసామీ చొక్కా తీసుకురావటానికి పోతే, దర్జీ కొడుకు తన గుడ్డలాటి గుడ్డతో కుట్టిన చొక్కా తొడుక్కుని ఆడుకుంటూ కనిపించాడు. తరవాత అసామి దర్జీ నుంచి చొక్కా తీసుకుని తొడుక్కున్నాడు. అది అతడికి సరిపోయింది.

తరవాత అతను మొదటి దర్జీ కనిపించినప్పుడు, "నువు చాలదన్న గుడ్డతో మరొక దర్జీ నాకు చొక్కా కుట్టగా మిగిలిన గుడ్డతో తన కొడుక్కు చొక్కా కుట్టుకున్నాడు. ఏమంటావు?" అని అడిగాడు.

"ఆ దర్జీ కొడుక్కు ఎన్నేళ్ళు?" అని మొదటి దర్జీ అడిగాడు.

"ఆరేళ్ళు," అన్నాడు అసామీ.

"ఇకనేం? నా కొడుక్కు పన్నెండేళ్ళు," అన్నాడు మొదటి దర్జీ.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2 & 3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు ఏప్రిల్ 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '78 జూన్ నెల చందమామలో ప్రకటింపబడును.

---

ఫిబ్రవరి నెల పోటీ ఫలితం: మూఢాచారాల నోట్లో మట్టిగడ్డ.

గెలుపొందిన వారి పేరు: సి హెచ్. శాయిబాబ, స్టెనో, సిమెంట్ నగర్,

(కర్నూలు జిల్లా)

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



Srivatsa S. Vati



V. Muthuraman

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : సూది బెజ్జం

రెండవ ఫోటో : దారానికి తెలుసు

పంపినవారు : కుమారి ఆర్. వి. కామేశ్వరి, కావేరీ నగర్, మద్రాసు-15

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.


THE
COMMERCIAL
SERVICE OF
SRI LANKA
BROADCASTING
CORPORATION





















# పార్లే పాపిన్స్

పండ్లరుచిగల పిప్పరమెంట్లు



5 పండ్ల సువాసనలలో—
రాస్ప్‌బెరి, అనాస, నిమ్మ
నారింజ, మోసంబి.

everest/1036/PP-tl